
Every child's best friend
JUNIOR
QUEST
Where finding out is fun
New monthly English children's magazine
A CHANDAMAMA VIJAYA COMBINES PUBLICATION
A SUPER BARGAIN
A SUPER BARGAIN FOR OUR FIRST SUBSCRIBERS!
A Whole year's JUNIOR QUEST for Rs50- only
HURRY NOW and Send Your
Money Order / Postal Order / Demand Draft
to M/s. DOLTON AGENCIES
CHANDAMAMA BUILDINGS
VADAPALANI
MADRAS 600 026

# చందమామ

మార్చి 1989

★

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



★


విడి ప్రతి: 3-00
సంవత్సర చందా: 36-00

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికీ పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయికు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాల నుంచి

4 మాసాల నుంచి

6 మాసాల నుంచి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008

Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/ST12/TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''రాజయోగం''] కు ఆధారం. ఎన్. శివనాగేశ్వరరావు రచన. మనిషి సుఖజీవనానికి అవసరం అయిన వాటిల్లో, ముఖ్యమైనది ధనం. పిసినారితనం లాటి అవగుణాలు లేకుండా, ధనార్జన చేస్తూ, దాన్ని పొదుపుగా వాడుకోవడంలో, మనిషి ఎంతో విజ్ఞత ప్రదర్శించాలి. ''అయాచితధనం'' అన్న కథ ఇందుకు మంచి ఉదాహరణ.

## అమరవాణి

మూర్ఖస్య పంచ చిహ్నాని, గర్వీ దుర్వచనీ తథా,
హఠీ చాప్రియ వాదీ చ, పరోక్తం నైవమన్యతే.

[గర్వమూ, దురుసుగా మాట్లాడడం, మొండితనం, ఇతరులను చులకనగా చూడడం, ఎదుటివారి భావాలను హేళనచేయడం— ఈ ఐదూ మూర్ఖుల లక్షణాలు]

సంపుటి 84 మార్చి '89 సంచిక 3

విడి ప్రతి : 3-00 :: సంవత్సర చందా : 36-00

# చందమామ కబుర్లు



## చరిత్రపూర్వయుగపు మత్స్యం!

హిందూ మహాసముద్రంలో పరిశోధనలు జరుపుతూన్న జపాన్ శాస్త్రజ్ఞులకు ఒక వింత చేప దొరికింది. దానికి మాటాడే శక్తి గనక వున్నట్టయితే, మనిషి పుట్టుక గురించి దాని తాత ముత్తాతలు చెప్పిన విషయాలు తెలియజేసి వుండేది. 80 కిలోల బరువుగల ఈ చేప, ఎప్పుడో నశించిపోయిందని భావించబడుతూన్న కోల్‌కాంత్ మత్స్య సంతతికి చెందినది.

## ఎగిరే పళ్లాలు!

1968 వ సంవత్సరం అక్టోబర్ 3 వ తేదీన, ఆకాశంలో గుండ్రటి వింత పళ్ళాలు ఎగరడం చూసినట్టు, బ్రెజిల్ దేశానికి చెందిన ముగ్గురు వైమానికులు తెలియజేశారు.





## నెపోలియన్ ఉత్తరం!

1903 వ సంవత్సరం డిసెంబర్ 7 వ తేదీన నెపోలియన్ బోనాపార్ట్ తన సేనానికి రాసిన ఒక ఉత్తరం వేలానికి రానున్నది. ఇంగ్లాండును జయించే పథకం గురించి ఆయన ఉత్తరంలో రాశారు. తమ ఓడలు ఈజిప్టుకేసి వెళుతూన్నట్టు మభ్యపెట్టి, హఠాత్తుగా ఇంగ్లాండును ముట్టడించాలని ఆయన ఉత్తరంలో తెలియజేశారు.

## అతి ప్రాచీనమైన సంగీత వాద్యం!

ఒరిస్సా రాష్ట్రంలోని బొలాంగీర్ జిల్లాలో అతి ప్రాచీనమైన సంగీత వాద్యం కనుగొనబడింది. అదొక రాతి లిథోఫోన్.



# బహుమానం

ఒకానొక జమీందారు, దానకర్ణుడుగా పేరు పొందాడు. ఇతరులు తనకేమాత్రం ఉపకారం చేసినా, వాళ్ళకు ఏదో బహుమానంగా యిస్తేగాని, ఆయనకు తృప్తిగా వుండేదికాదు.

ఒకసారి, జేబులో వున్న ఇరవై వరహాల సంగతి మరిచిపోయి, ఆయన బట్టలుతికేవాడికి చొక్కా వేశాడు. మర్నాడు వాడు, జమీందారు దగ్గిరకు వచ్చి, "అయ్యా, చొక్కా జేబులో వున్న యీ ధనం, తమరు మరిచినట్టున్నారు!" అంటూ ఇరవై వరహాలు ఆయన కిచ్చాడు.

"ఇంత నిజాయితీ గల పనివాళ్ళు చాలా అరుదు. ఇదుగో, ఈ పది వరహాలు బహుమానంగా తీసుకో!" అన్నాడు జమీందారు.

మరొకసారి, జేబులో వున్న పది వరహాల సంగతి మరిచి, ఇతర బట్టలతోపాటు చొక్కాను బట్టలుతికేవాడికి పంపించాడు.

మర్నాడు వాడు, జమీందారు దగ్గిరకు వచ్చి, "మీరు చొక్కాజేబులో మరిచిపోయిన ఐదు వరహాలు యివిగోనండి!" అంటూ ఆయన కిచ్చాడు.

జమీందారు ఏదో గుర్తు తెచ్చుకుంటూ, "చొక్కాజేబులో పది వరహాలుండాలనుకుంటాను!" అన్నాడు.

"అయ్యా, ఎలాగూ అందులో సగం, నాకు బహుమానంగా యిస్తారని, ముందుగానే తీసుకున్నాను," అన్నాడు బట్టలుతికేవాడు.

చీటికిమాటికీ, బహుమానాలు యివ్వడం మంచిది కాదని తెలుసుకున్న జమీందారు, తన అలవాటు మార్చుకున్నాడు.

—వి. రఘురామరాజు





# కోడలి ఎన్నిక

కరుణ పేరుకు తగినట్టే, కరుణహృదయం గల పిల్ల. అమ్మాయి వయసు ఎనిమిదేళ్ళే అయినప్పటికీ, చుట్టూ వున్న పరిస్థితులు ఆమెకు వయసుకు మించిన పెద్దరికం అబ్బేలా చేశాయి.

కరుణ ఏడాది పిల్లగా వుండగానే తల్లి పోయింది. తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. సవతితల్లి కాపరానికి వస్తూనే, పసిపిల్లను సాకడానికి చీదరించుకున్నది. అయినా తప్పేది లేదు గనక, కరుణ ఆకలికి ఏడ్చినప్పుడల్లా గుప్పెడు మెతుకులు పడెయ్యడంతో, తన బాధ్యత తీర్చుకున్నది. కరుణ ఎక్కువగా చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళ ఆదరాభిమానాలతోనే పెరిగి పెద్దదయింది.

ఆ విధంగా కరుణ రోజులు వెళ్ళదీస్తుండగా, ఒకసారి కరుణ సవతితల్లి జానకి పుట్టింట ఎవరిదో పెళ్ళి వచ్చింది. ఎనిమిదేళ్ళ కరుణను ఒంటరిగా వదిలివేసి, ఆమె తన కొడుకునూ, భర్తనూ తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

చీకటిపడేవేళ కరుణ తనకోసం అన్నం వండుకుని, ఊరగాయ వేసుకుని భోజనం ముగించింది. అసరికి పెద్ద వర్షం ప్రారంభమైంది. అది ఎంతకూ తగ్గేట్టు కనిపించలేదు. ఒంటరిగా వున్నది గనక, కరుణను తమ ఇంట్లో పడుకోవడానికి రావలసిందిగా పక్కింటి రాజమ్మ చెప్పింది.

కరుణ ఇంటి తలుపులన్నీ జాగ్రత్తగా మూసి బైటికి వచ్చేసరికి, అరుగు మీద ఎవరో మనిషి పడివుండడం కనిపించింది. కరుణ చప్పున అతడివద్దకు వెళ్ళి తాకి చూసింది. స్పృహలేనిస్థితిలో పడివున్న అతడి ఒళ్ళు, సలసల కాగిపోతున్నది.

''అయ్యో, జ్వరం వచ్చినట్టున్నది!'' అనుకున్న కరుణ, అతణ్ణి తట్టి లేపుతూ,

లక్ష్మీగాయత్రి

''బాబుగారూ! బాబుగారూ!'' అని పిలిచింది.

అతను అతికష్టం మీద కళ్ళు తెరిచి చూశాడు. ''నెమ్మదిగా లేస్తారా. ఇంట్లోకి వెళదాం,'' అన్నది కరుణ.

కరుణ అతడికి సాయం పట్టి ఇంట్లోకి తీసుకువచ్చి, మంచం మీద పడుకో బెట్టింది. తర్వాత పొడిగుడ్డ తీసుకువచ్చి, శుభ్రంగా తల తుడుస్తూ, ''బాబుగారూ, ఒక్కసారి ఓపిక తెచ్చుకుని లేవండి. బట్టలు మార్చుకుని పడుకుందురుగాని,'' అన్నది.

ఆమె, అతడి పక్కన పడివున్న సంచీ చూపిస్తూ, ''ఇందులో మీ బట్ట లున్నాయా ?'' అని అడిగింది.

అతడు వున్నయ్యన్నట్టు తల ఊప గానే, సంచీలోంచి కాస్త తడీపొడీగా వున్న బట్టలు తీసి, అతడి కిచ్చింది.

''మీరు కాసేపు కళ్ళు మూసుకుని పడుకోండి. రెండిళ్ళ అవతలే ఆచారి గారున్నారు. ఆయన్నడిగి మందు తెస్తాను,'' అని చెప్పి, కరుణ గొంగళి తల మీద కప్పుకుని బయటికి వెళ్ళింది.

ఆమె పదినిమిషాల్లో తిరిగివచ్చి, ''ఇదిగో, ఆచారిగారు జ్వరానికని అడిగితే, యీ మందిచ్చారు. రాజమ్మత్తనడిగి వేడి పాలు కూడా తెచ్చాను. మందు వేసుకుని వేడిపాలు తాగండి,'' అన్నది.

అతడు కృతజ్ఞతగా చూస్తూ, లేచి మందు వేసుకుని పాలు తాగాడు. వేడి



వేడిపాలు గొంతు దిగగానే, అతడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

''ఎవరమ్మా, నువ్వు ? నీ పేరేమిటి?'' అని అడిగాడు, కరుణ కేసి ఆప్యాయంగా చూస్తూ.

''నా పేరు కరుణ,'' అని, తనను గురించిన వివరాలు చెప్పింది కరుణ.

ఆ తర్వాత యిద్దరూ నిద్రపోయారు. తెలవారి కరుణ లేచేసరికే, అతను

పోదామనివచ్చి, నేను జబ్బుపడ్డాను,'' అంటూ నవ్వి, ''నా ప్రాణదాతవు. నీ ఉపకారాన్ని ఎప్పటికీ మర్చిపోలేనమ్మా. నాకు చేతనైనంతవరకూ, నీకు ప్రత్యుపకారం చేస్తాను. ఈలోగా నీకు అవసరం అయితే, ఈ మామయ్యను గుర్తుచేసుకో! నా చిరునామా, యిదిగో!'' అని, తన చిరునామా రాసిన కాయితం కరుణ చేతిలో పెట్టాడు.

వెళ్లి

బయలుదేరడానికి సిద్ధంగా వున్నాడు. అతడు కరుణతో, ''నిన్ను నువ్వెవరో

తర్వాత గురునాథం బయలుదేరి పోయాడు.

నన్ను గురించి అడగనే
రు గురునాథం. పట్నంలో
దు రకాల వ్యాపారాలున్నవి.
డికి జబ్బుగా వుంటే చూసి

పది సంవత్సరాలు గడిచిపోయాయి. కరుణ యిప్పుడు పెళ్ళీడుకు వచ్చి, చక్కని యువతిలా తయారైంది. ఈ పది సంవత్సరాల్లో కొన్ని సంఘటనలు జరి

చెప్పావుగాని
లేదు. నా పే
నాకు నాలుగ్గ
ఒక స్నేహిత







గాయి. కరుణ సవతితల్లి, హఠాత్తుగా జబ్బు చేసి చనిపోయింది. కరుణకు ఆమె మాతామహుడి ద్వారా, అనుకోకుండా కొంత ఆస్తి కలిసివచ్చింది.

ఇలా వుండగా—ఒక వేసవి కాలపు మధ్యాహ్నపుటెండ తీవ్రంగా వున్నవేళ, కరుణ భోజనం ముగించుకుని వచ్చేసరికి, బయట అరుగు మీది నుంచి ఎవరిదో మూలుగు వినబడింది. కరుణ వచ్చి చూసేసరికి, అక్కడ ఒక ఎనభై ఏళ్ళ వృద్ధుడు శోషిల్లి ఆయాసపడుతున్నాడు.

కరుణ అతడివద్దకు వెళ్ళి, "అయ్యో, తాతా! ఇంత ఎండలో ఒక్కడివీ వస్తున్నావా? నెమ్మదిగా లేచి లోపలికిరా," అని అతడికి చెయ్యి అందించి లేవదీసి లోపలికి తీసుకువచ్చింది.

తర్వాత అతణ్ణి మంచం మీద పడుకోబెట్టి, చల్లని నీళ్ళలో గుడ్డతడిపి, అతడి ముఖం తుడిచి, తాగేందుకు మజ్జిగ యిచ్చింది. దానితో వృద్ధుడు తెప్పరిల్లి, "నూరేళ్ళు చల్లగా జీవించు, తల్లీ!" అని దీవించి లేవబోయాడు.

కరుణ చప్పున ఆపి, "ఇంత ఎండలో ఎక్కడికి వెళతావు, తాతా?" అన్నది.

ఆ ప్రశ్నకు వృద్ధుడు బెదిరినట్టు చూస్తూ, "అసలు నేనెందుకు యీ ఊరు వచ్చాననుకుంటున్నావు?" అని, తన చేతి సంచీలోంచి డబ్బు మూట తీసి కరుణకు చూపించి, "నా కొడుకు గురునాథం, పట్నంలో పేరుబడ్డ వ్యాపారి. ఈ ఊళ్ళో కొన్ని బాకీలు వసూలు చేసుకు రమ్మని, నన్ను పంపించాడు. నేను ఇల్లు చేరకపోయినా ఫర్వాలేదుగాని, సాయంత్రానికల్లా యీ డబ్బు వాడికి చేరకపోతే ప్రాణాలు తీసేస్తాడు!" అన్నాడు.

కరుణ వృద్ధుడి మాటలు వింటూనే, ఏదో గుర్తువచ్చినదానిలా లోపలికి వెళ్ళి, పది సంవత్సరాలక్రితం గురునాథం యిచ్చి వెళ్ళిన చిరునామా కాగితం తెచ్చి, అతడికి చదివి వినిపించి, "తాతా, యీ



గురునాథంగారేనా మీ అబ్బాయి ?'' అని అడిగింది.

''అవునమ్మా. వాడి చిరునామా నీ దగ్గిర కెలా వచ్చింది ?'' అన్నాడు వృద్ధుడు.

కరుణ పది సంవత్సరాల కింద జరిగినది, అతడికి చెప్పింది.

''అలాగా ! వెళ్ళి వస్తాను,'' అంటూ మంచం మీది నుంచి లేవబోయాడు వృద్ధుడు.

కరుణ అతణ్ణి ఆపి, ''తాతా, ఒక్క మాట చెప్పు. ఈ వయసులో నిన్ను, నీ కొడుకు సరిగా చూడడం లేదని తేలిపోయింది. అయినా, ఆయన దగ్గిరే వుండాలన్న పట్టుదలలో వున్నావా ?'' అని అడిగింది.

''అటువంటి పట్టుదల, నాకేమీలేదు. కన్న కొడుకే చూడనప్పుడు, నన్నీ వయసులో కూర్చోబెట్టి తిండిపెట్టేవాళ్ళెవరు ?'' అన్నాడు వృద్ధుడు.

''అయితే విను, తాతా ! ఇప్పటికి భోజనం చేసి హాయిగా విశ్రాంతి తీసుకో. సాయంత్రం నేను, నీతోపాటు వచ్చి, నిన్ను జాగ్రత్తగా చూసుకోమని ఆయనకు చెబుతాను. ఆయన కాదుకూడదంటే, నాతోపాటు యిక్కడికి వచ్చెయ్యి. నేనే నీ మనమరాలి ననుకుని, నా దగ్గిర వుండువుగాని,'' అన్నది కరుణ.

''ఏ జన్మలోనే నువ్వు, నా మనమరాలివై వుంటావు. అలాగే కానీ, తల్లీ !'' అన్నాడు వృద్ధుడు.

పని మీద పొరుగూరు వెళ్ళిన, కరుణ తండ్రి రంగస్వామి సాయంత్రానికి తిరిగి వచ్చాడు. కరుణ, వృద్ధుడిని గురించి రంగస్వామికి చెప్పింది.

రంగస్వామి, వృద్ధుడితో, ''బాబూ, మా కరుణ చెప్పినట్టే చేయండి,'' అని సలహా యిచ్చాడు.

ఆ తర్వాత ముగ్గురూ ప్రయాణమై, వృద్ధుడి ఇంటికి వెళ్ళారు. అక్కడ గురునాథం కంటబడగానే, వృద్ధుడు చిరునవ్వు నవ్వి, కరుణ చేయిపట్టుకుని ముందుకు

నడుస్తూ, "నా మనమరాల్ని వెంట బెట్టుకువచ్చారా, గురునాథం!" అన్నాడు.

గురునాథం కరుణకేసి చూస్తూ, "నేను గుర్తున్నానా, అమ్మా?" అని అడిగాడు.

కరుణ చిరునవ్వునవ్వి తల ఊపింది. అంతలో పాతికేళ్ళ అందమైన యువకు డొకడు అక్కడికి వచ్చాడు. గురునాథం, అతణ్ణి పరిచయం చేస్తూ, "వీడు మా అబ్బాయి శ్రీకాంతుడు," అని చెప్పాడు.

తర్వాత ఆయన సైగ చేయగానే, శ్రీకాంతుడు అక్కడి నుంచి వెళ్ళి పోయాడు. అప్పుడు గురునాథం—రంగ స్వామి, కరుణలతో, "కొన్ని లక్షలకు ఆస్తిమంతుడైన, మా నాన్న ఆడిన నాటకం, మీకు ఆశ్చర్యం కలిగిస్తున్నది కదూ! చెబుతాను, వినండి. పది సంవత్స రాల క్రితం కరుణను చూశాను. ఆమె శాంతస్వభావం, దయాగుణం నన్ను ఆకర్షించాయి. నాకు శ్రీకాంతు డొక్కడే కొడుకు. వాడి తల్లి అమధ్యనే పోయింది. ఆమె ఎంతో మృదుస్వభావురాలు. అలాంటి కోడల్ని తెచ్చుకోవాలన్నది, నా అభిలాష. మా నాన్న పెట్టిన పరీక్షలో, కరుణ నెగ్గింది!" అని రంగస్వామి చేయిపట్టు కుని, "మా శ్రీకాంతుణ్ణి చూశారుగదా. కరుణను, మా ఇంటి కోడల్ని చేయడానికి మీరు యిష్టపడితే—అంతకన్న మాకా వలసిందేమీలేదు," అన్నాడు.

"మీ యిష్టమే, మా యిష్టం!" అన్నాడు రంగస్వామి.

"అలాకాదు. కరుణ ఇష్టపడితేనే, యీ వివాహం జరిగేది. ఏమ్మా, కరుణా! శ్రీకాంతుడు, నిన్ను పెళ్ళాడడానికి అంగీకారం తెలిపాడు. ఇంక నీ యిష్టం చెప్పాలి," అన్నాడు గురునాథం.

కరుణ సిగ్గుతో తల వంచుకున్నది. గురునాథం తండ్రి నవ్వుతూ, కరుణ చేయి పట్టుకుని, "ఒరే, గురునాథం! ఆడపిల్ల, యింతకంటే ఏం చెప్పగలదు?" అన్నాడు.

ఒక శుభముహూర్తాన కరుణ— శ్రీకాంతుల వివాహం వైభవంగా జరిగి పోయింది.





# విషపు మిఠాయి

ఒకనాడు అమరపురి దేశానికి చెందిన ముగ్గురు భటులకు, పొరుగు రాజ్యమైన అశ్వదేశ గూఢచారి వినయుడు దొరికి పోయాడు. అతణ్ణి బందీగా రాజధానికి తీసుకుపోతూ, అరణ్యంలో ఒకచోట కొద్ది సేపు విశ్రాంతి తీసుకోవాలనుకున్నారు, భటులు.

వాళ్ళు, వినయుణ్ణి అక్కడ వున్న చెట్టుకు, తాళ్ళతో కట్టివేశారు. వినయుడి వద్ద భటులకు ఒక సంచీ దొరికింది. ఆ సంచీలో వాళ్ళకు, ఒక పొట్లం కనిపించింది. అందులో మిఠాయి ఉండలు వున్నవి. అవి మంచి నేతి వాసనతో, వాళ్ళకు నోరూరింపసాగాయి.

వాటిని భటులు మూడు భాగాలుగా చేసుకుని, తినేందుకు సిద్ధమయ్యారు. అయితే, వాళ్ళల్లో ఒకడు, ఏదో అనుమానం కలిగినట్టు ముఖం పెట్టి, ''ఇందులో ఏదైనా విషం కలిసి వుండవచ్చు, తినకండి!'' అని హెచ్చరించాడు.

భటులు మిఠాయిని తినడమా, మానడమా అన్న సందిగ్ధంలోపడ్డారు. వాళ్ళను చూసి వినయుడు నవ్వి, ''మీకు లేనిపోని అనుమానాలెందుకు? ఒకటి నాకు యివ్వండి,'' అన్నాడు.

ఒక భటుడు మిఠాయి ఉండల్లో ఒక దాన్ని, వినయుడి నోటికి అందించాడు. తర్వాత అతడికి మంచినీళ్ళు కూడా యిచ్చాడు. పావుగంటకాలం గడిచినా, వినయుడిలో ఎలాంటి మార్పూలేదు. ఇది గమనించిన భటులు, తమ అనుమానానికి స్వస్తిచెప్పి, మిఠాయి ఉండల్ని సంతోషంగా తినేశారు.

కొంతసేపు తర్వాత భటులు, వినయుణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరారు. దారిలో ఒకచోట వినయుడు కుప్పలా కూలిపోయి,

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

గిలగిల తన్నుకోసాగాడు. భటులు ఎక్కడలేని ఆశ్చర్యంతో అతడికేసి చూడ సాగారు.

అప్పుడు వినయుడు, వాళ్ళతో, "మీరు నన్ను వదిలిపెట్టరని, నాకు తెలును. రాజధానికి తీసుకుపోయి, మా దేశ రహస్యాలు చెప్పమని నన్ను చిత్రహింస లకు గురిచేస్తారు. ఇలాంటి ప్రమాదం రావచ్చుని నేను ముందే ఊహించి, దగ్గిర విషం కలిపిన మిఠాయి ఉండలు వుంచు కున్నాను. ఈ విషం వెంటనే కాక, కొంత ఆలస్యంగా పని చేస్తుంది. అందు వల్లనే, యింకా విషప్రభావానికి గురి కాని, నా మాటలు నమ్మి, మీరు మిఠాయి తిన్నారు," అన్నాడు.

ఇది విని భటులు ముగ్గురూ కొయ్యా బారిపోయారు. వినయుడికి కాళ్ళూ, చేతులూ కొట్టుకోవడం మరింత ఎక్కు వయింది.

భటుల్లో ఒకడు, మిగతా ఇద్దరితో, "ఈ గూఢచారి మనను బాగా మోసగించి, ప్రాణాలకే ఎసరుపెట్టాడు. మనం, వీడి తర్వాత గదా—విషం కలిపిన మిఠాయి తిన్నది. విషప్రభావం మన మీద పని చేయడానికి, మరికొంత సమయం పట్ట వచ్చు. అయినా, యిప్పుడేం చేయడం?" అన్నాడు బెంబేలుపడిపోతూ.

"ఈ దుర్మార్గుణ్ణి యిక్కడే చాపనిద్దాం. ఏ అరణ్యజంతువో, వీడి శవాన్ని తినేస్తుంది. మనం ప్రాణాలు కాపాడుకోవాలి గనక, యీ చుట్టుపక్కల ఏదైనా గ్రామం వున్నదేమో చూసి, అక్కడి వైద్యుడి చేత చికిత్స చేయించుకుందాం," అన్నాడు ఇంకొక భటుడు.

ఆ వెంటనే, భటులు అక్కడి నుంచి పరిగెత్తిపోయారు. వాళ్ళు వెళ్ళిన కొంత సేపటికి వినయుడు నవ్వుకుంటూ లేచి కూర్చున్నాడు. నిజానికి, ఆ మిఠాయి ఉండల్లో విషం లేదు.

తన పథకం యింత బాగా పారినందుకు సంతోషిస్తూ, వినయుడు తన దేశ సరి హద్దులకేసి బయలుదేరాడు.





# ఐదు ప్రశ్నలు

## 4

మరునాడు ధీరసింహుడు రాగానే, సులోచన అతనితో, "ఇక్కడికి యాభై యోజనాల దూరంలో నైరుతి దిక్కున ఒక మాయా పన్నీటితటాకం ఉన్నది. దాని పుట్టుపూర్వోత్తరాలేమిటి? ఇదే నా నాలుగవ ప్రశ్న." అన్నది.

ధీరసింహుడు ఆమెవద్ద మూడు నెలలు గడువుతీసుకుని నైరుతీ దిక్కుకేసి పయనమయ్యాడు. ఏడు రోజులు ప్రయాణం చేశాక అతనికొక పట్టణం కనిపించింది. పట్టణం సరిహద్దులలో ఒక పాడుపడిన బావి చుట్టూ జనం మూగివున్నారు. వాళ్ళ మధ్య సంపన్నులయిన వృద్ధదంపతులు హృదయవిదారకంగా విలపిస్తున్నారు.

ధీరసింహుడు వారిని సమీపించి, సంగతి ఏమిటని అడిగాడు.

"ఈ వృద్ధదంపతుల ఒక్కగా నొక్క కుమారుడు గుణశేఖరుడు, వారంరోజుల క్రితం, హఠాత్తుగా పిచ్చెత్తినట్టయి, ఈ పాడుపడిన బావిలోకి దూకేశాడు. ఈ వృద్ధుల విషాదం చూడలేకున్నాము," అన్నారు అక్కడ చేరిన వారు.

"మరణం ఎవరికైనా తప్పింపరానిది కదా! మరి, జరిగిపోయినదానికింతగా విలపించడంవల్ల ప్రయోజనం ఏమిటి?" అన్నాడు ధీరసింహుడు.

"అది నిజమే. కాని, గుణశేఖరుడు మరణించాడని అనుకోలేము. ఎందు



కంటే, ఇంతవరకు అతడి శవం నీళ్ళపైకి తేలలేదు,'' అన్నారు వారు.

ధీరసింహుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, వృద్ధదంపతులతో, ''మీ కుమారుణ్ణి తెచ్చి మీకు అప్పగించే బాధ్యత నాది. నిశ్చింతగా వుండండి.'' అని చెప్పి, ఆ బావిలోకి దూకాడు!

అతడు బావిలో చాలాలోతుకు వెళ్ళాడు. కాలికి నేలతగిలింది. చుట్టుపక్కల పరిశీలనగా చూశాడు. ఎడమవైపున బిలంవంటి సన్నటి మార్గం కనిపించింది. అందులో ప్రవేశించి కుడివైపుకు తిరిగేసరికి, బ్రహ్మాండమైన రెండు తలుపులు గభాలున తెరుచుకున్నాయి. అతడు లోపలికి వెళ్ళాడు. వింతవింత ఫలపుష్పాలతో విలసిల్లే ఉద్యానవనం మధ్య ఒక అద్భుత భవనం కనిపించింది. ధీరసింహుడు భవనంలోపలికి వెళ్ళాడు. భవనంనిండా వింతకాంతులు విరజిమ్మే దీపాలు వెలుగుతున్నాయి. భవనం మధ్య చంద్రశిలా ఫలకం మీద కూర్చుని ఒక అపురూప సౌందర్యవతి వీణవాయిస్తున్నది. ఆమెకు ఎదురుగా మరొక ఉన్నతాసనంమీద ఒక యువకుడు కూర్చుని ఆమె పాట వింటూ తన్మయస్థితిలో వున్నాడు.

ధీరసింహుడు లోపల ప్రవేశించగానే, వీణానాదం ఆగిపోయింది. యువకుడు ఆశ్చర్యంగా ధీరసింహుడికేసి చూశాడు. అతడే గుణశేఖరుడని ధీరసింహుడు ఊహించాడు.

''గుణశేఖరా, కన్న తల్లిదండ్రులు నీ కోసం నిద్రాహారాలు మాని విలపిస్తున్నారు. నువ్వేమో ఇక్కడ హాయిగా విలాసాలతో కాలం గడుపుతున్నావు! ఇది న్యాయమా?" అని అడిగాడు ధీరసింహుడు అతణ్ణి సమీపిస్తూ.

గుణశేఖరుడు సిగ్గుతో తలవంచుకున్నాడు.

అప్పుడు ధీరసింహుడు ఆ సౌందర్యవతితో, ''నువ్వు చూడడానికి సుగుణవతిలాగా కనిపిస్తున్నావు. మనకున్న అంద

చందాలు, శక్తిసామర్థ్యాలు ఎదుటివారి మంచికి ఉపయోగపడితేనే వాటికి సార్థకత లభిస్తుంది. అయితే, నీ అందం కారణంగా గుణశేఖరుడు నీ వశమయ్యాడు. లేకలేక పుట్టిన ఒక్కగా నొక్క కొడుకు కనిపించకపోయేసరికి, ఆ వృద్ధు లెంతగా విలపిస్తున్నారో కాస్త ఆలోచించి చూడు," అన్నాడు.

ఆ మాటలకు ఆమె, "నువ్వన్నది ముమ్మాటికీ నిజం. కాని, నేను భూలోకానికి వచ్చానంటే నా దివ్యత్వం కోల్పోయి మామూలు మానవకాంతనైపోతాను. కాబట్టి, అతడు వెళ్ళి తన తల్లిదండ్రులను చూసి రావడంలో నాకెటువంటి అభ్యంతరమూ లేదు," అన్నది.

ఆమె అనుమతితో ధీరసింహుడు, గుణశేఖరుణ్ణి వెంటబెట్టుకుని, వచ్చిన దారిగుండానే బావిలోకి ప్రవేశించి, అక్కడి నుంచి పైకి వచ్చాడు.

వాళ్ళను చూసి, అక్కడి వాళ్ళందరూ ఆనందాశ్చర్యాలతో పొంగిపోయారు. ఇక చూడలేమనుకున్న కొడుకు తిరిగి రావడంతో, వృద్ధదంపతులు అవధులు లేని ఆనందం పొందారు. ధీరసింహుడి ధైర్యసాహసాలనూ, పరోపకారదీక్షనూ నోరారా పొగిడి, అతణ్ణి మనసారా దీవించారు.



అక్కడినుంచి ధీరసింహుడు మళ్ళీ తన ప్రయాణం సాగించాడు. మూడు రోజులు ప్రయాణం చేశాక, అతనికి మరొక పట్టణం కంటపడింది. ఆ పట్టణంలో ఎదురుపడ్డ ఒక వృద్ధుణ్ణి పలకరించి, ధీరసింహుడు మాయా పన్నీటితటాకం గురించి అడిగాడు. అక్కడికి వెళ్ళిన వాళ్ళెవరూ తిరిగి రాలేదనీ, అక్కడికి వెళ్ళడం ఆత్మహత్యతో సమానమనీ చెప్పాడు వృద్ధుడు. కాని ధీరసింహుడు పట్టుదలవదలకుండా, అక్కడికి వెళ్ళే మార్గం చెప్పమని వృద్ధుణ్ణి ప్రార్థించాడు. ఆఖరికి వృద్ధుడు, "ఈ పట్టణం దక్షిణ ద్వారం దాటి పది ఆమడల దూరం



వెళ్ళావంటే దారి రెండుగా చీలుతుంది. ఎడమవైపు కాలిబాటగుండా వెళ్ళావంటే ఒక కొండ కనిపిస్తుంది. కొండకవతల విరజాపుర రాజధానీనగరం వస్తుంది. ఆ రాజు అధీనంలోనే మాయా పన్నీటి తటాకం ఉన్నదని చెబుతారు. ఆ రాజుకు మణులు మాణిక్యాలంటే వల్లమాలిన ప్రేమ. కానుకగా మణులు సమర్పించి రాజును మంచిచేసుకో. నీ కార్యం సఫల మవుతుంది,'' అని దీవించి వెళ్ళాడు.

ధీరసింహుడు వృద్ధుడు చెప్పిన మార్గం గుండా వెళ్ళి, కొండదాటి, అనేక అవాంతరాలను అధిగమించి, విరజానగరం చేరుకున్నాడు. రాజునుసందర్శించివిలువయిన మణిని కానుకగా ఇచ్చాడు. ఇలా వరసగా ఏడు రోజులు రాజదర్శనం చేసుకుంటూ మణులు సమర్పించుకుంటూ వచ్చాడు. అతని చర్యకు సంతోషించినరాజు, ''రోజు తప్పకుండా నువ్వు నాకు మణులు కానుకగా ఇస్తున్నావు. మరి నానుంచి ఏదైనా కోరుకో.'' అన్నాడు.

''తప్పకుండా నా కోరిక తీర్చగలరని మాట యిస్తే అడుగుతాను, మహారాజా!'' అన్నాడు ధీరసింహుడు వినయంగా.

''ఏమాత్రం సంశయం వద్దు. ఏదైనా సరే నీ కోరిక తప్పక తీరుస్తాను, అడుగు,'' అన్నాడు రాజు.

''అయితే, మాయా పన్నీటితటాకం చూడడానికి నన్ను అనుమతించండి మహారాజా,'' అన్నాడు ధీరసింహుడు.

ఉలిక్కిపడ్డాడు రాజు. ఆ తరవాత తేరుకుని, ''మాయా తటాకం చూడాలనే ఆశ నీలో కలిగించిన వారు నీ శత్రువులై వుంటారు. ఎందుకంటే ఆ మాయలో పడ్డ వారెవ్వరూ ఇంతవరకు తిరిగిరాలేదు. అందువల్ల, ఆ కోరిక వదులుకో,''అన్నాడు.

కాని, ధీరసింహుడు తన పట్టుదల వదలలేదు. ఇక వేరే మార్గం లేక, రాజు ఇద్దరు భటులను పిలిచి, ధీరసింహుణ్ణి మాయా పన్నీటితటాకం వద్దకు తీసుకుపొమ్మని ఆజ్ఞాపించాడు.

నగరానికి దక్షిణ దిక్కున కొంత దూరంలో ఒక పెద్ద ద్వారాన్ని నలుగురు భటులు కాపలా కాస్తున్నారు. ద్వారం సమీపంలో ఒక పలకమీద, ''ప్రాణాలపై ఆశ ఉన్న వాళ్ళెవ్వరూ లోపల ప్రవేశించ రాదు!'' అని రాసి ఉన్నది.

కాపలా భటులు ద్వారం తలుపులు తెరిచారు. ధీరసింహుడు లోపలికి వెళ్ళ గానే తలుపులు వాటంతట అవే మూసు కున్నాయి. మూడడుగులు వేసి అతడు వెనకకు తిరిగిచూశాడు. అక్కడ తలుపులూ లేవు; గోడలూ లేవు. ఎటు చూసినా విశాలమైన మైదానం కనిపిం చింది. కొంతసేపటికి పొడవాటి జడతో ఒక విచిత్ర రూపు డొకడు ఎదురువచ్చి, ధీరసింహుడికి నమస్కరించి, ''ఇక్కడికి వచ్చినవారికి పన్నీటి తటాకంలో స్నానం చేయించడమే నా వృత్తి'' అన్నాడు.

ధీరసింహుడు అతనివెంట నడిచాడు. కొంత దూరం వెళ్ళేసరికి, ఒక బ్రహ్మాండ మైన భవనం, ఆ భవనం మధ్య పరిమ ళాలు వెదజల్లే పన్నీటి తటాకం కనిపిం చింది. వచ్చినవాడు, ధీరసింహుడికి ఆ తటాకాన్ని చూపుతూ, ''అందులోకి దిగి మధ్యకు వెళ్ళు. నేనూ వస్తాను.'' అన్నాడు.

ధీరసింహుడు తటాకంలోకి దిగాడు. మోకాళ్ళవరకే నీళ్ళున్నాయి. విచిత్ర వ్యక్తి గట్టుమీదున్న చెంబు తీసుకుని, నీళ్ళలోకి దిగి మూడు చెంబుల నీళ్ళు





ముంచి, ధీరసింహుడి తలపై పోశాడు. మూడవ చెంబు నీళ్ళు పోసిన వెంటనే విచిత్ర వ్యక్తి మాయమయ్యాడు. క్షణ క్షణానికి నీళ్ళు పొంగుతూ ధీరసింహుడి గొంతువరకు వచ్చాయి. అతడు పైకి చూశాడు. తటాకంమీది పై కప్పుకు ఒక గొలుసు వేలాడడం కనిపించింది. ఒక్క ఊపుతో ఎగిరి ఆగొలుసునుపట్టుకున్నాడు. మరుక్షణమే 'ఢామ్మ'ని శబ్దం వినిపించింది. చుట్టుపక్కల కటిక చీకటి అలముకున్నది. ఏమి జరుగుతున్నదో తెలుసుకోవడానికి ధీరసింహుడు అటూ ఇటూ చూశాడు. భవనమూ లేదు; పన్నీటి తటాకమూ లేదు. అతడొక పచ్చిక మైదానంలో నిలబడివున్నాడు. అమితాశ్చర్యంతో అతడు మరికొంత ముందుకు నడిచాడు. అక్కడ అతనికొక ఎత్తయిన చిన్న మండపం కనిపించింది. దాని చుట్టూ అనేక చలువరాతి విగ్రహాలున్నాయి. మండపానికి కొంత దూరంలో చదునుగా నున్న బండమీద ఒక ధనుస్సూ, మూడు బాణాలు గల అమ్ములపొదీ కనిపించాయి.

ధీరసింహుడు మండపాన్ని సమీపించాడు. మండపం మధ్య ఒక బంగారు పంజరం వేలాడుతున్నది. పంజరంలో పంచవన్నెల రామచిలుక ఉన్నది. మండపం గోడకు అమర్చబడి వున్న రాతి పలకలో ఇలా రాసి ఉన్నది: ఐదువందల సంవత్సరాలకు పూర్వం అమరతేజ మహారాజు ఈ ప్రాంతానికి వేటకు వచ్చాడు. ఆయనకు ఇక్కడ అపురూపమైనజీవమణి దొరికింది. ఆ మణి తన అనంతరం, అర్హత గల వారికే చెందాలన్న ఉద్దేశంతో, తన మాయాశక్తితో పన్నీటితటాకం— పరిసర ప్రదేశాన్ని సృష్టించి మణిని భద్రపరిచాడు. బండమీద ఉన్న ధనుస్సు తీసుకుని, పంజరంలోని చిలుక ఎడమ కన్నును మూడు బాణాలతో కొట్టగలిగిన వారు ఈ మాయను జయించి, జీవమణిని సాధించగలరు. లేనివారు చలువరాతి శిలగా మారిపోతారు!

ధీరసింహుడు వెంటనే, బండమీది ధనుస్సు అందుకుని, బాణం ఎక్కుపెట్టి చిలుక కంటికేసి కొట్టాడు. బాణం గురి తప్పింది. మరుక్షణమే అతడు మోకాళ్ళ వరకు రాయిగా మారిపోయాడు. అతడు ఏమాత్రం భయపడకుండా రెండవ బాణం కూడా వదిలాడు. కాని, అది కూడా చిలుకకు తగలలేదు. అతడు నడుము వరకు రాయిగా మారిపోయాడు. అప్పుడు పంజరంలోని చిలుక కిలకిలానవ్వి, "ధీరసింహా, నీకెందుకీ వృథా ప్రయాస. నన్ను కొట్టడం నీకు సాధ్యం కాదులే," అన్నది పరిహాసంగా.

ధీరసింహుడు పట్టువదలకుండా గురి చూసి మూడవ బాణం వదిలాడు. అది సరాసరి చిలుక ఎడమ కంటికి తగిలింది. అంతే! పిడుగుపడినట్టు బ్రహ్మాండమైన శబ్దం వినిపించింది. ఒక్క క్షణం ఉరుములతో మెరుపులతో భూమి అదిరినట్టయింది. కొంతసేపటికి మండపమూ, పంజరమూ ఏదీ కనిపించలేదు. ఆ ప్రాంతమంతా వెన్నెలతో నిండిపోయింది. కొంతదూరంలో అపురూపమైన జీవమణి ధగధగా మెరుస్తూ అతని దృష్టి నాకర్షించింది. అతడామణిని తీసుకుని చలువరాతి విగ్రహాలకు తాకించాడు. వెంటనే విగ్రహాలు రాజకుమారులుగా మారి, మాయనుంచి తమకు విముక్తి గలిగించిన ధీరసింహుడికి కృతజ్ఞతలు తెలియజేసి, తమ తమ దేశాలకు పయనమయ్యారు.

ధీరసింహుడు కౌశాంబీనగరం తిరిగి వచ్చి, మాయా పన్నీటి తటాకం పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడంలో తనకు ఎదురయిన అనుభవాలన్నిటినీ సులోచనకు వివరించాడు. అంతా విన్న సులోచన, "నువు చెప్పినదంతా నిజమే. నీ కారణంగా పన్నీటితటాకం మాయనుంచి విముక్తి పొందిన రాజకుమారులందరూ నీ ధైర్య సాహసాలను దేశదేశాలలో చాటుతున్నారు. రేపు వచ్చావంటే ఆఖరిదయిన ఐదవ ప్రశ్న చెబుతాను," అని అతణ్ణి సాగనంపింది. —(ముగింపు వచ్చేసంచికలో)





# రాజయోగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, చేపట్టిన కార్యం, ఎంతటి కఠినశ్రమలకైనా ఓర్చిసాధించి తీరాలనే, నీ పట్టుదల అభినందనీయం. ఒక్కొక్కసారి పరిస్థితుల ప్రభావం కారణంగా, సాధించదలచిన కార్యానికి మించిన రెట్టింపు ఫలితం కలగవచ్చు. దాన్ని గుర్తించగలిగిన వివేకం, సమయస్ఫూర్తి లేకపోతే, మనిషి సిరిరామోకాలడ్డిన జడుడనిపించుకుంటాడు. శివుడనే గొర్రెలకాపరి, ఇలాంటి పనే చేశాడు. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు అతడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



శాంతిపురిరాజ్యంలోని ఒక పల్లెలో, శివుడనే గొర్రెలకాపరి యువకుడుండే వాడు. వాడు మంచి ధైర్యశాలి. వాడికి నా అనేవారెవరూ లేరు. రోజూ ఊరివాళ్ళ గొర్రెలను, పల్లెకు దూరంగా వున్న కొండ వద్దకు తోలుకుపోయి, మేపుకొస్తూండే వాడు.

ఒక రోజు, శివుడు కొండదాపున గొర్రెలను మేపుతూండగా, ఒక ముని కొండ దిగివస్తూ కనిపించాడు. ఆ కొండ మీదికి మనుషులెవరూ వెళ్ళేవాళ్ళుకాదు. కారణమేమంటే—ఆ కొండ ముండ్లపొదలతో, విషసర్పాలతో నిండివుండేది. అలాంటి కొండ మీది నుంచి ముని, పూల మీది నుంచి నడిచి వస్తున్నట్టు దిగిరావడం చూసి, శివుడు ఆశ్చర్యపోయాడు.

ముని కొండ దిగిపోతూ, శివుడివైపు చూసి చిరునవ్వు నవ్వాడు. శివుడు, ఆయనకు రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

ముని, వాణ్ణి ఆశీర్వదించి, "నాయనా, శివా! నీకు రాజయోగం వున్నది. నెల రోజులు తిరిగేసరికి, నీవు ఒక రాజ్యానికి రాజు వవుతావు. అందుకు సిద్ధంగా!" అని ముందుకు సాగిపోయాడు.

ముని మాటలు శివుడికి చాలా ఆశ్చర్యం కలిగించాయి. గొర్రెలకాపరి అయిన తను రాజు కావడమా! కాని, కొంచెంసేపు ఆలోచించాక, వాడికి ముని మాటలు సత్యం కానున్నవనిపించింది. వాడు ఊళ్ళోకి వెళ్ళి, కొందరికి జరిగిన సంగతి చెప్పాడు. వాళ్ళు, శివుణ్ణి పిచ్చివాణ్ణి చూసినట్టు చూసి పొట్ట చెక్కలయేలా నవ్వుకున్నారు.

అయితే, శివుడి మాటలు విన్న శరభుడనే దర్జీవాడు, వాణ్ణి ఆటపట్టించాలని, "ఒరే, శివా! నువ్వు, కాబోయే రాజువు కదా. ఇలాంటి చిరుగుల దుస్తులతో తిరగ్గూడదు. రాజు ధరించే దుస్తుల్లాంటివి కుట్టిపెడతాను. నీ దశ తిరుగుతుంది," అన్నాడు.

శివుడు తాను దాచుకున్న డబ్బంతా ఖర్చుచేసి, ఖరీదైన బట్ట కొని, దర్జీ కిచ్చాడు. దర్జీ వాడికి రాజోచితమైన దుస్తులు కుట్టి యిచ్చాడు. వాడి రాజు వేషం చూసి, ఊరి జనమంతా నవ్వ సాగారు.

మల్లయ్య అనే వస్తాదు, శివుడితో, "నీకు మల్లయుద్ధం తెలుసా?" అని అడిగాడు.

శివుడు తెలియదన్నాడు.

"నీకు కత్తియుద్ధం కూడా తెలియదు. కనీసం నీ దగ్గిర కత్తి కూడా లేదు. నీవేం రాజువి?" అని వస్తాదు, వాణ్ణి హేళన చేశాడు.

శివుడు, ఆ ఊళ్ళో కర్రసాము, కత్తి యుద్ధం నేర్పే విశ్వవర్మ అనే అతడి దగ్గిరకుపోయి, "నేను కాబోయే రాజును! కత్తియుద్ధం నేర్చుకోవాలనుకుంటు న్నాను," అన్నాడు.

విశ్వవర్మ నవ్వుకుని, "దానిదేముంది. నీకొక కత్తి అవసరం. ముందు దాన్ని సంపాదించు," అన్నాడు.

ఉన్న డబ్బంతా ఖర్చుచేసి, రాజు ధరించే దుస్తులు కుట్టించాను! ఇప్పుడు కత్తి సంపాయించడం ఎలా? అని శివుడు ఆలోచిస్తూ, కమ్మరిపని చేసే భైరవుడి దగ్గిరకుపోయి, "భైరవా, నేను కాబోయే



రాజును! మంచి కత్తొకటి చేసిపెట్టు. నేను రాజును కాగానే మంచి బహుమానం యిస్తాను," అన్నాడు.

భైరవుడు కూడా నవ్వుకుని, "శివుడూ, నా గొర్రెలు ఆరు తప్పిపోయాయి. కాస్తంత వెదికిపెట్టు. నీకు తప్పక కత్తి తయారుచేసి యిస్తాను," అన్నాడు.

శివుడు గొర్రెలను వెదుకుతూ, ఊరు దాటి చాలా దూరం వెళ్ళాక, ఒక చింత తోపులో అవి కనిపించాయి. వాటిని తోలు కుని తిరిగి వస్తూండగా, మార్గమధ్యంలో వాడికొక రథం ఎదురైంది.

ఆ రథంలో, శాంతిపురిరాజ్యం యువ రాణి నలంద, చెలికత్తెలతో ప్రయాణమై

పోతున్నది. ఆమె, రాజువేషంలో వుండి గొర్రెలను తోలుకువస్తున్న శివుణ్ణి చూసి, రథం ఆపించి, కిందికి దిగుతూ ఫక్కున నవ్వి, "ఏ దేశపు రాజకుమారుడివి? యిలా గొర్రెలను తోలుకుపోతున్నా వేమిటి?" అని ప్రశ్నించింది.

ఆమె అందం చూసి ముగ్ధుడయిన శివుడు, "నేను ప్రస్తుతానికి, ఏదేశపు రాజకుమారుణ్ణీ కాను. కాని, నెల రోజుల లోగా, రాజును కాబోతున్నాను. నేను రాజునైన తర్వాత, నిన్ను పెళ్ళాడాలను కుంటున్నాను. నీకు అంగీకారమేనా?" అని అడిగాడు.

ఆ మాటలకు ఆగ్రహించిన నలంద, వెంట వున్న భటులను "ఈ మూర్ఖుణ్ణి బంధించి తీసుకురండి!" అని ఆజ్ఞాపించి, తిరిగి రథం ఎక్కింది.

రాజభటులు, శివుడి పెడరెక్కలు విరిచికట్టి, తమతో తీసుకుపోసాగారు. కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళకు శరాబంది అనే, పర్వతాకారుడైన రాక్షసుడు ఎదురు పడ్డాడు. అతడి తల మీద కిరీటం వున్నది. ఒంటి నిండా బంగారు ఆభరణాలున్నవి. నడుం నుంచి ఖడ్గం వేళ్ళాడుతున్నది. ఎడమచేతిలో, రత్నాలు పొదిగిన గద వున్నది.

రాక్షసుణ్ణి చూస్తూనే, రాజభటులూ, చెలికత్తెలూ, రథసారథీ పారిపోయారు.

పెడరెక్కలు విరిచికట్టబడి వున్న శివుడితో, శరాబంది, "ఓయీ, మానవా!



వీరికి బందీవయ్యావు. ఏం తప్పు చేశా వేమిటి?'' అన్నాడు.

శివుడు ఏమాత్రం భయపడకుండా, ''నేనేం తప్పు చేయలేదు,'' అని జరిగిన దంతా రాక్షసుడికి చెప్పాడు.

అది విన్న శరాబంది, నలంద వంక చూసి, ''యువరాణీ, నేను శరాబంది అనే రాక్షసరాజును. భూలోకంలోని మంచిని తెలుసుకుని, దాన్ని మా లోకంలో అమలుచేయాలని, ఇక్కడికి వచ్చాను. అదృశ్యంగా వుండి, ఈ మనిషిని ముని దీవించడం దగ్గిర నుంచి, అంతా గమనిస్తూనే వున్నాను. సరే, ఇతడు నీతో అన్న మాటల్లో, తప్పేమీ నాకు కనిపించడం లేదు. తాను రాజయాక, నీకు అంగీకారం అయితే, అప్పుడు నిన్ను పెళ్ళాడతా నన్నాడు. అతడి మీద, ఎందుకంతగా ఆగ్రహించావు?'' అని ప్రశ్నించాడు.

నలంద కోపంగా, ''అతడు గుర్రాల కాపరి, నేను రాకుమార్తెను! ఈ మధ్య, మా తండ్రి హఠాత్తుగా మరణించడంతో, నేనే ఈ రాజ్యానికి ఏలికనయ్యాను. ఏమాత్రం వీరుడి లక్షణాలు లేని ఇతడు, నన్ను పెళ్ళాడగోరడం సహించరానిది.'' అన్నది.

ఆ జవాబుకు రాక్షసుడు నవ్వి, ''కార్య దీక్ష, పట్టుదలా వుంటే, వీరుడిగా మారడం ఎంతసేపు! పక్షం రోజుల్లో ఇతడిని, మహావీరుడిగా తీర్చిదిద్దగలను. అప్పుడు ఇతణ్ణి పెళ్ళాడగలవా?'' అని అడిగాడు.





నలంద ఒకక్షణం మౌనంగా వూరుకుని. తర్వాత, "నా రాజ్యం మీద, సింహపురి రాజు విక్రమసింహుడు అక్రమంగా దాడిచేశాడు. ఇతడు, ఆ విక్రమసింహుణ్ణి పారదోలగలిగితే, పెళ్ళాడతాను," అన్నది.

రాక్షసుడు సరేనన్నట్టు తల ఊపాడు. నలంద అక్కడి నుంచి వెళ్ళిపోయింది. పక్షంరోజులు గడిచేసరికి, రాక్షసుడు, శివుణ్ణి గదాయుద్ధం, ఖడ్గచాలనం మొదలైన విద్యలలో సుశిక్షితుణ్ణి చేశాడు.

తర్వాత రాక్షసుడూ, శివుడూ కలిసి విక్రమసింహుడు సైన్యంతో వున్నచోటుకు వెళ్ళారు. రాక్షసుణ్ణి చూసి, అతడి సైన్యం చెల్లాచెదురైంది. విక్రమసింహుడు కత్తి దూసి శివుడి మీదికి వచ్చాడు. కొద్దిసేపు పోరు జరిగాక, విక్రమసింహుడి చేతి కత్తి ఎగిరి దూరంగా పడింది. అతడు గుర్రం మీద పారిపోయాడు.

మర్నాడు రాక్షసుడు శివుడితో కలిసి, నలంద వద్దకు వెళ్ళి, "విక్రమసింహుణ్ణి శివుడు ఓడించాడు. అతడు గుర్రం మీద తన రాజధాని కేసి పారిపోయాడు," అని చెప్పాడు.

"విక్రమసింహుణ్ణి ఓడించిన ఘనత, శివుడిది కాదు. నిన్ను చూసి, అతడి సైన్యం చెల్లాచెదురైంది. ఆ బెదురులో యుద్ధం చేసిన విక్రమసింహుణ్ణి ఓడించడం, అంత గొప్ప ఏమీ కాదు," అన్నది నలంద.

అందుకు రాక్షసుడు, "నీవు తెలివైనదానివే! కాని, నీ రాజనీతితంత్రాన్ని మాత్రం, మా మీద ప్రయోగించకు," అన్నాడు.

నలంద ఏదో చెప్పబోయేంతలో, భటుడొకడు అక్కడికి వచ్చి, "మహారాణీ, విక్రమసింహుడు, గుర్రం మీది నుంచి పడి మరణించాడు. అతడి దుష్టపాలనతో విసిగిపోయిన మంత్రీ, రాజోద్యోగులూ, ప్రముఖులూ—అతణ్ణి ఓడించిన శివుణ్ణి, తమ రాజుగా చేసుకోవాలని నిర్ణయించుకున్నట్టు, వార్త వచ్చింది," అని చెప్పాడు.

ఇది విన్న నలంద, శివుడివైపు సిగ్గు పడుతూ చూసి, "నిన్ను వివాహమాడడానికి, నాకెలాంటి అభ్యంతరం లేదు," అన్నది.

రాక్షసుడు పెద్దగా నవ్వి, "మా రాక్షసులు, మీ మానవులకన్న ఉదారబుద్ధులనిపిస్తున్నది!" అని, శివుణ్ణి, "ఈ వివాహం, నీకు యిష్టమే గదా?" అని ప్రశ్నించాడు.

"నేనీమెను వివాహమాడను!" అన్నాడు శివుడు నిండుకంఠంతో.

రాక్షసుడు, శివుడి భుజం తట్టి, "భళీ, మానవా! నీది చాలా వివేకవంతమైన నిర్ణయం. నువ్వు రాజుగా రాణించగలవు!" అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శివుడు నలందను వివాహమాడివుంటే, సింహపురితోపాటు, శాంతిపురికి కూడా రాజైవుండేవాడు. అలాంటి మంచి అవకాశాన్ని, అతడు జారవిడుచుకోవడం మందబుద్ధి అనిపించుకోదా? అలాంటి వాణ్ణి, రాక్షసుడు మెచ్చుకోవడాన్ని ఏమనాలి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నలంద పెద్ద స్వార్థపరురాలు. దాడి చేయవచ్చిన విక్రమసింహుణ్ణి, శివుడు ఓడించినా, కుంటిసాకులతో అతణ్ణి వివాహమాడ నిరాకరించింది. ఆ శివుడే సింహపురికి రాజయ్యాడని వినగానే, జంకుగొంకులు లేకుండా, అతణ్ణి వివాహమాడడానికి సమ్మతి తెలిపింది. దీనితో శివుడు, ఆమెలోని స్వార్థపరత్వాన్నీ, అధికారవ్యామోహాన్నీ గుర్తించి, ఆమెను వివాహమాడ నిరాకరించాడు. రాక్షసుడు ఇది గ్రహించి, శివుణ్ణి మెచ్చుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సవతితల్లి

సాహిత్యం మీద అభిమానం వుండే ఒకావిడ, తన సవతికొడుకును, కన్నకొడుకు కంటె ఎక్కువగా ప్రేమించి పెద్ద చేసింది. ఆవిడ పోషణలో అతడొక గొప్ప కవి అయ్యాడు.

సవతితల్లుల దుర్మార్గాలను విమర్శిస్తూ, అతడు రాసిన వ్యంగ్య కావ్యానికి మంచి పేరొచ్చింది. చివరకు రాజుగారు అతణ్ణి సన్మానించి గొప్ప బహుమానం కూడా యిచ్చారు. దానితో అతడు ఇంటికి వచ్చి, సవతితల్లి పాదాలకు నమస్కరించాడు.

అప్పుడామె, అతడితో, "నాయనా, లోకంలో సవతితల్లులంటే, అసలే చిన్నచూపున్నది. నిన్ను నేను ఎంతో ప్రేమగా పెంచాను కదా! మాలాటి వాళ్ళ మీద చులకన అభిప్రాయం కలిగేలా, కావ్యాన్ని రాయడం భావ్యమా?" అని కంటనీరు పెట్టుకున్నది.

"క్షమించమ్మా! లోకంలోని సవతితల్లులందరూ నీలా వుండివుంటే నేనీ కావ్యాన్ని రాసే వాణ్ణి కాదు. సాహిత్యం వల్లనే కదా, నీవు సంస్కరించబడి దేవతలా మారింది. మిగిలిన సవతి తల్లుల సంగతేమిటి?" అని అతడు సవతితల్లి కంటినీరు తుడిచాడు.

ఆ తల్లి హృదయం ఆనందంతో పొంగిపోయింది. —డా॥ కాటిచెర్ల గురురామప్రసాద్





# నెహ్రూకథ–3

జవహర్‌లాల్ 1907వ సంవత్సరం ఉన్నత విద్యాభ్యాసం కోసం హారో నుంచి కేంబ్రిడ్జ్ చేరుకున్నాడు. అక్కడ విజ్ఞానశాస్త్రం అభ్యసించినప్పటికీ, అతడు చరిత్ర, రాజకీయ, ఆర్థికశాస్త్రాల పట్ల ఎంతో ఆసక్తి కనబరచేవాడు.

భారతదేశం నుంచి వచ్చే వార్తాపత్రికలను అతడు ఆసక్తితో చదివేవాడు. ముఖ్యంగా తీవ్రవాదులయిన బాల గంగాధరతిలక్, శ్రీ అరవిందుల స్వదేశీ ఆదర్శభావాలు అతన్నెంతగానో ఆకర్షించాయి. అతని తండ్రి మోతీలాల్ మితవాదవర్గానికి చెందిన నాయకులలో ఒకరుగా వుండేవారు.






అనాడు కేంబ్రిడ్జ్‌లో నివసించే భారతీయులు 'మజ్లిస్' అనే సంస్థను స్థాపించి, నాటి రాజకీయ పరిస్థితులను తరచూ చర్చించేవారు. జవహర్‌లాల్ ఆ సభలకు వెళ్ళి, వాళ్ళ ఉపన్యాసాలను ఆలకించేవాడు. కాని, సంకోచం కారణంగా అతడెప్పుడూ ఉపన్యసించలేదు.



1909 వ సంవత్సరం వేసవిలో జవహర్ లాల్ తన తండ్రితోపాటు ఐరోపా దేశాలు పర్యటించాడు. అతడు మొట్ట మొదటి సారిగా బెర్లిన్‌లో విమానం చూశాడు. ఆ విమానంలో కౌంట్ జెప్పెలిన్ వచ్చాడు. అతనికి జర్మనీ రాజు కైసర్ స్వాగతం పలికాడు.

1910 వ సంవత్సరం కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయంలో పట్టభద్రు డయ్యాక, జవహర్‌లాల్ నార్వే వినోదయాత్ర చేశాడు. ఆ సమయంలో ఒకనాడతడు ఒక ఐరోపా మిత్రుడితో కలిసి నదీ స్నానానికి వెళ్ళాడు. మంచుగడ్డలా చల్లగా వున్న నీళ్ళు తగలగానే అతని కాళ్ళు చేతులు జివ్వుమన్నాయి. ఏటి వాలు నదీప్రవాహంనుంచి, ఆ మిత్రుడు జవహర్‌లాల్‌ను కాపాడాడు.





ఆ తరవాత, జవహర్‌లాల్ లండన్‌లో న్యాయశాస్త్రం అభ్యసించాడు. 1912లో న్యాయశాస్త్రంలో పట్టభద్రుడై భారత దేశానికి తిరిగి వచ్చాడు. ప్రజ్ఞావంతు డయిన తన కుమారుడు, న్యాయవాద వృత్తిలో తనకు తగిన వారసుడు కాగల డని మోతీలాల్ పరమానందం చెందాడు.

స్వదేశానికి తిరిగి వచ్చిననాటి నుంచీ, జవహర్‌లాల్ రాజకీయాలలో ఆసక్తి కనబరచసాగాడు. 1912వ సంవత్సరం బంకిపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యాడు. ఆ సభలలో ఒక్క గోపాలకృష్ణగోఖలే మాత్రమే అతణ్ణి ఆకట్టుకోగలిగాడు.





జవహర్‌లాల్ ఉన్నత న్యాయస్థానంలో న్యాయవాది వృత్తిని ప్రారంభించాడు. అయినా, ఎక్కువ ఆసక్తి కనబరచలేదు. అతడు తరచూ వేటకు వెళ్లేవాడుగాని, జంతువులను చంపడానికి ఇష్టపడేవాడుకాదు. ఒకనాడు గాయపడ్డ జింకపిల్ల కిందపడి, పెద్ద పెద్ద కళ్ళతో దీనంగా చూడడం చూసి, జాలిపడి నాటి నుంచి వేట మానుకున్నాడు!

1916వ సంవత్సరం లక్నో కాంగ్రెస్ సభలలో, జవహర్‌లాల్ గాంధీజీని మొట్టమొదట చూశాడు. దక్షిణాఫ్రికాలో బ్రిటిష్‌వాళ్ళు, భారతీయులపట్ల కనబరచిన దురన్యాయాన్ని ఎదుర్కొని పోరాడిన గాంధీజీని చూసి, జవహర్‌లాల్ ఎంతో సంతోషించాడు.





జవహర్‌లాల్‌ను చాలా ఆకర్షించిన మరొక ప్రముఖవ్యక్తి—అలహాబాదులో అనేక ఉపన్యాసాలిచ్చిన శ్రీమతి సరోజినీనాయుడు. అతిత్వరలో జవహర్‌లాల్ ఒక దృఢమైన జాతీయవాదిగా రూపొందాడు.

1916 వ సంవత్సరం వసంత పంచమి నాడు, ఢిల్లీలో జవహర్‌లాల్‌కు కమలతో వివాహం సంప్రదాయ బద్ధంగానూ, వైభవోపేతంగానూ జరిగింది. జవహర్‌లాల్ పూర్వీకుల నివాసస్థలమైన కాశ్మీర్‌లో, నూతన వధూవరులు కొన్నాళ్ళు గడిపి వచ్చారు.





జవహర్‌లాల్ తన బంధువుతో కలిసి లడక్ ప్రాంతానికి వెళ్ళాడు. అమర్‌నాథ్ ఆ సమీపంలోనే వుందని భావించి, ఇద్దరూ ఒక కొండ మీదికి వెళ్ళారు. హఠాత్తుగా కాలుజారి, జవహర్‌లాల్ ఒక పగులులోకి దిగబడిపోయాడు. వెంటనే బంధువు, పెద్ద తాడు ఒకటి విసరడంతో దానిని పట్టుకుని పైకి వచ్చి, జవహర్‌లాల్ గండం నుంచి బయటపడ్డాడు. —(ఇంకావుంది)



# అయాచితధనం

పూర్ణయ్య అనే వాడికి, దూరపుబంధు వొకడు చచ్చిపోతూ, ఆస్తిలో పాతికవేల వరహాల వాటా యిచ్చాడు. అది తెచ్చుకునేందుకు, వాడు పొరుగూరు వెళ్ళాడు. అక్కడ వాడి అదృష్టాన్ని చాలామంది మెచ్చుకున్నారు. ఆ మెచ్చుకోళ్ళు అతడిలో, అనుమానాన్ని రేకెత్తించాయి!

పూర్ణయ్య తన గ్రామానికి తిరుగు ప్రయాణం అవుతూండగా, నారయ్య అనే వాడు కలిసి, "అయ్యా, మీ ఊళ్ళో వుండే పుల్లయ్య కూతురు, మా అబ్బాయికి నచ్చింది. వచ్చే నెలలో పెళ్ళికి ముహూర్తం పెట్టించమని, నేను చెప్పినట్టు ఆయనకు చెప్పండి," అన్నాడు.

సరేనని, పూర్ణయ్య అయాచితంగా, తనకు లభించిన పాతికవేల వరహాలతో ఇంటికి వెళ్ళి, ఆ డబ్బును రహస్యంగా ఒకచోట పాతిపెట్టాడు.

తర్వాత వాడు, పుల్లయ్య ఇంటికి వెళ్ళి, "నాఅంత దురదృష్టవంతుడు, యీ ప్రపంచంలో వుండడు. కష్టపడి బతికేవాడికి, అయాచితంగా పాతికవేల వరహాలు వచ్చాయి గదా, బోలెడు పొలం కొనుక్కొని సుఖంగా జీవించవచ్చును కున్నాను. కానీ, దారిలో నన్ను దొంగలు దోచేశారు. దానితోపాటు, నేను కూడబెట్టుకున్న డబ్బు నూరువరహాలూ పోయాయి. ఇప్పుడు రోజులెలా గడుస్తాయో తెలియడం లేదు!" అంటూ లబోదిబో మన్నాడు.

పుల్లయ్య జరిగిందానికి బాధపడి, "ఇంతవరకూ నీకూ, నాకూ అట్టే స్నేహం లేదు. మనం బంధువులమూ కాదు. నీ డబ్బు పోయిన విషయం, నాతో ఎందుకు చెప్పుకుంటున్నావు?" అని అడిగాడు.

అప్పుడు పూర్ణయ్య, "అయ్యో, నా గొడవలోపడి అసలు విషయం మరిచే



పోయాను. నీకో శుభవార్త! నీ కూతురుకు పెళ్ళి కుదిరింది.'' అని నారయ్య చెప్పమన్న సంగతి చెప్పాడు.

మల్లయ్య ఎంతో సంతోషంగా, ''ఇంత మంచి వార్త తెచ్చావు. నీకు, నేనే విధంగా సాయపడగలను ?'' అన్నాడు.

''నాకొక నూరు వరహాలు అప్పుగా యివ్వు: ఒక ఏడాదిలోగా, నీ అప్పు తీర్చేస్తాను,'' అన్నాడు పుల్లయ్య.

''నూరువరహాల బాకీ తీర్చడానికి, ఏడాది కావాలా ?'' అన్నాడు పుల్లయ్య ఆశ్చర్యంగానూ, అనుమానంగానూ.

"విను, పుల్లయ్యా! పాతికవేల వరహాల ఆస్తి కలిసొచ్చిందనగానే, నాలో ఎన్నో ఆశలు రేగాయి. బోలెడుపొలంకొనుక్కుని, స్వంతంగా వ్యవసాయం చేయాలనుకున్నాను. ఆ డబ్బు పోయినా యిప్పుడు స్వంతంగా వ్యవసాయం చేయాలని, నాకు పట్టుదలగా వున్నది. నిన్నడిగినట్టే నలుగుర్నీ తలో నూరు వరహాలూ అడిగి, నాలుగెకరాల భూమి కొనుక్కోవాలనుకుంటున్నాను,'' అన్నాడు పూర్ణయ్య.

''పొలం సరిగ్గా పండకపోతే, ఏం చేస్తావు ?'' అన్నాడు పుల్లయ్య.

''రెండువేల వరహాలు ఖరీదు చేసే, ఇల్లుంది నాకు. ఆ ఇల్లమ్మేసి బాకీలు తీర్చేస్తాను.'' అన్నాడు పూర్ణయ్య.

ఇంటి విషయం వినగానే పుల్లయ్యే కాదు, ఇంకా చాలామంది పూర్ణయ్యకు ధైర్యంగా అప్పిచ్చారు. పాతికవేల వరహాలు పోగొట్టుకున్నాడన్న జాలికొద్దీ కూడా కొందరు వాడికి సాయపడ్డారు.

పూర్ణయ్య నాలుగెకరాలపొలం కొనుక్కుని, కష్టపడి పని చేయసాగాడు. వాడి శ్రమచూసి ఊళ్ళో అంతా, 'పట్టుదలంటే పూర్ణయ్యదే !'' అని మెచ్చుకున్నారు.

ఆ ఏడాది పంటలు బాగా పండాయి. పూర్ణయ్యకు అందరికంటే బాగా దిగుబడి వచ్చింది. చేసిన అప్పుల్లో మూడొంతులు తీర్చేశాడు. వాడునిజాయితీపరుడుకావడం వల్లా, హామీగా యిప్పుడు ఇంటితోపాటు

పొలం కూడా వుండడంవల్లా, ఎవ్వరూ వాణ్ణి డబ్బుకోసం వత్తిడి చేయలేదు.

రెండో సంవత్సరం గడిచేసరికి, పూర్ణయ్య పాత బాకీలన్నీ పూర్తిగా తీర్చేయడమే గాక, మరొక ఎకరం భూమి కూడా కొన్నాడు. వాడి కృషికి ముచ్చటపడి, ఆ ఊరి రైతొకడు తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. పూర్ణయ్య భార్య పేరు గౌరి.

పెళ్ళయ్యాక గౌరి వాడితో, "మొదటి నుంచీ నువ్వంటే, నాకిష్టమే! నువ్వు లేనివాడివని, మా నాన్న నువ్వంటే ఒప్పుకో లేదు. నీకు పాతికవేల వరహాల ఆస్తి కలిసిందని తెలియగానే, ఆయన నిన్ను అల్లుణ్ణి చేసుకునేందుకు యిష్టపడ్డాడు. కానీ, నువ్వా డబ్బు పోగొట్టుకున్నావని తెలిసి, అజాగ్రత్తపరుడివని మళ్ళీ నిన్ను వదులుకున్నాడు. కానీ, నువ్వు స్వయం కృషితో కష్టపడి పైకి వచ్చావుగా! అందువల్ల మన పెళ్ళి జరిగింది. అయితే నాదొక్క సందేహం?" అని, ఆగింది.

"చెప్పు, ఏమిటా సందేహం?" అని అడిగాడు పూర్ణయ్య.

"ఇల్లు నీకు ఎన్నాళ్ళనుంచో వున్నది. చాలా కాలం నువ్వు అందరి పొలాల్లోనూ పని చేశావు. మొదట్లోనే అప్పు చేసి పొలం కొనుక్కోవలసింది. అలా ఎందుకు చేయలేదు? పోయిన డబ్బు నీలో పట్టుదలను



పెంచిందా, లేక డబ్బు పోయింది కాబట్టే, ఊళ్ళోవాళ్ళు జాలిపడి, నీకు అప్పు యిచ్చారా?" అని అడిగింది.

భార్య ప్రశ్నకు పూర్ణయ్య నవ్వి, "అసలు విషయం ఎవ్వరికీ తెలియదు. అర్ధాంగివి కాబట్టి నీకు నిజం చెబుతున్నా విను. పాతికవేల వరహాలతో పాటు, పుల్లయ్య కూతురుకు పెళ్ళి కుదిరిందన్న కబురు కూడా, నేను మోసుకురావలసి వచ్చింది! వాడి కూతురు పెళ్ళికి పదివేల వరహాలదాకా ఖర్చవుతుందని, నా అంచనా. ఆ పరిస్థితుల్లో పుల్లయ్య నన్నే అప్పడిగి వుండేవాడు. వాడికీ, నాకూ పెద్దగా పరిచయం ఏమీ లేదు. అయినా

నేను డబ్బు లేదంటే వాడేకాదు. ఊళ్లో వాళ్ళెవరూ కూడా నన్ను హర్షించరు. ఎందుకంటే, నాది కష్టపడి సంపాయించు కున్న డబ్బు కాదు. అయాచితంగా వచ్చిన సొమ్ము. అదంటే ఎవరికైనా లోకువే! పుల్లయ్యే కాకుండా, ఇంకా ఎవరైనా నన్నప్పుడిగి, లేదంటే ఆగ్రహించ వచ్చు. అయాచితంగా వచ్చిన డబ్బుని ఎవ్వరూ ఒక పట్టాన అప్పు తీర్చరు కూడా. అందుకే డబ్బు పోయిందని అబద్ధం చెప్పాను,'' అన్నాడు.

గౌరి ఆశ్చర్యంగా, ''నీకు ముందు చూపు చాలా ఎక్కువ. అయితే నువ్వు నిజంగా కష్టపడి సంపాదించిన డబ్బుతో బాకీలు తీర్చలేదా? నీకు కలిసివచ్చిన సొమ్ములోంచే రహస్యంగా తీసి వాడు తూండేవాడివా?'' అని అడిగింది.

''అదేం కాదు. నా బాకీలన్నీ కష్టపడి సంపాదించిన డబ్బుతోనే తీర్చాను. నా స్వయంకృషి మీద నాకు నమ్మకం వున్నది. ఇదివరలో అయితే అప్పు చేయ డానికి భయంగా వుండేది. దురదృష్టం కొద్దీ పంటలు సరిగా పండకపోతే, బాకీలు తీర్చడానికి వున్న ఒక్క ఆధారమైన ఇల్లు అమ్ముకోవాలి. పాతికవేల వరహాలు నాకు అప్పుచేసే ధైర్యాన్నిచ్చాయి. ఆ ధైర్యంతో నేను కష్టపడి పని చేశాను. అందువల్ల అయాచితంగా వచ్చిన డబ్బూ పోలేదు; ఊళ్ళో నాకు గౌరవమూ పెరిగింది. నా శక్తియుక్తుల మీద, నాకు నమ్మకం కలిగింది. నీవంటి ఉత్తమ ఇల్లాలిని భార్యగా పొందగలిగాను,'' అన్నాడు పూర్ణయ్య సంతోషంగా.

''నీలో ముందుచూపుంది. సోమరి తనం లేదు. అయాచిత ధనాన్ని నీలా ఉపయోగించుకోగలిగినవాడికి, జీవితంలో ఎదురుండదు. నిన్ను భర్తగా పొందడం, నా అదృష్టం,'' అన్నది గౌరి.

ఆ తర్వాత నుంచి, పూర్ణయ్య పట్టిం దల్లా బంగారమే అయింది. అయినప్పటికీ వాడు స్వయంకృషిని వీడకుండా, ఆదర్శ ప్రాయంగా వుండే జీవితం గడిపాడు.





# కృష్ణావతారం

తన దక్షిణాది మిత్రులు చెప్పిన సలహా తలకెక్కి రుక్మి, చక్కగా అలంకరించి ఉన్న సభాభవనంలో జూదం ఆడటానికి ఒక బంగారు పలకా, పావులూ, పాచికలూ ఏర్పాటు చేయించి, సరదాగా జూదం ఆడదాం రమ్మని బలరాముడికి కబురు పంపాడు. ద్యూతప్రియుడైన బలరాముడు వెంటనే ఉత్సాహంతో వచ్చాడు.

బలరాముడితో రుక్మి ఆడితేనే బాగుంటుందని దాక్షిణాత్యులు అన్నారు. పందెం కాయటానికి ముత్యాలూ, మణులూ, బంగారమూ కుప్పలు పోశారు. జూదం ఆరంభమయింది. పదివేల బంగారు మాడలు పందెంకాచి బలరాముడు ఓడిపోయాడు. మళ్ళీ అంతే పందెం కాచి మళ్ళీ ఓడాడు. ఇదే విధంగా ప్రతిసారీ బలరాముడే ఓడుతూ వచ్చాడు.

చిట్టచివరకు బలరాముడు కోటి బంగారు మాడలు పందెంకాచి గెలిచాడు. కాని, రుక్మి గెలుపు తనదేనని గట్టిగా కేక పెట్టాడు. "బలరాముడికి పందెం వెయ్యటమే చేత కాదు. నేను కోటి బంగారం గెలుచుకున్నాను, చూసుకోండి," అన్నాడతను.

అతని మిత్రుడైన కళింగరాజు, "నిజమే! అంతే!" అంటూ పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు. బలరాముడికి కోపం వచ్చింది. కాని అతను తనను తాను నిగ్రహించుకుని, అక్కడ చేరిన వాళ్ళతో, "పందెం నేను గెలిస్తే, ఇతను

19. నరకుడి విజృంభణ



తాను గెలిచానంటాడేమిటి? మీరు నిజం చెప్పండి,'' అన్నాడు.

ఒక్కడూ జవాబు చెప్పలేదు.

రుక్మి బలరాముడితో, ''నేను గెలిచానటానికి సందేహమేమీ లేదే! ఎందుకిలా కక్కుర్తిపడి అబద్ధాలాడుతున్నావు?'' అన్నాడు. అంత పచ్చి అబద్ధానికి ఏమి సమాధానం చెప్పాలో బలరాముడికి అర్థం కాలేదు. ఇంతలో ఆకాశవాణి, ''బలరాముడి మాటే నిజం. రుక్మి అబద్ధమాడాడు. మీరంతా మొద్దులల్లే చూస్తూ ఊరుకుంటారేం?'' అని పలికింది.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. బలరాముడు ఇక నిగ్రహించుకోలేక ఆవేశంతో రుక్మిని ఒక్క గుద్దుతో హతమార్చి, జూదపు పలక తీసుకుని కాళింగుడి తల పగిలేటట్టు కొట్టాడు. మిగిలిన రాజులు తన పైకి వస్తే, కత్తి దూసి ఊచకోత కోశాడు. ఇలా కొందరు చావగా, మిగిలిన వాళ్ళు బెదిరి పారిపోయారు.

బలరాముడిలా బీభత్సం చేసి, తన బసకు వెళ్ళి, కృష్ణుడితో జరిగిన సంగతి చెప్పాడు. కృష్ణుడు జరిగినదాన్ని గురించి ఆక్షేపించలేదు, హర్షించనూలేదు. కాని మిగిలిన యాదవులు బలరాముణ్ణి తెగ మెచ్చుకుని, అతనికి చాలా తృప్తి కలిగించారు.

ఆ తరవాత అందరూ వధూవరులను వెంటబెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చేశారు.

బలరాముడు సాటిలేని బలపరాక్రమాలూ, శక్తి సామర్థ్యాలూ కలవాడు. పదివేల ఏనుగుల బలం కలవాడని ఖ్యాతి పొందిన భీముడు బలరాముడి వద్దనే శిక్షణ పొందాడు. ఇద్దరికీ యుద్ధం జరిగే పక్షంలో భీముడు గెలుస్తాడన్న నమ్మకం కూడా ఉండేది కాదు.

ఒకసారి కృష్ణుడి కొడుకైన సాంబుడు, దుర్యోధనుడి కుమార్తె అయిన లక్షణను ప్రేమించి, ఆమెను తీసుకుని పారిపోసాగాడు. అప్పుడు కౌరవులు సాంబుణ్ణి

తరిమి పట్టుకుని, హస్తినాపురానికి తెచ్చి, చెరలో ఉంచారు. అది తెలిసి బలరాముడు ఉగ్రుడై హస్తినాపురానికి వచ్చి సాంబుణ్ణి విడిచిపుచ్చమని మర్యాదగా అడిగాడు. అందుకు కౌరవులు ఒప్పుకోలేదు.

అప్పుడు బలరాముడు హస్తినాపురాన్ని జనంతోనూ, ఇళ్ళతోనూ సహా గంగలోకి తోస్తానని ప్రతిజ్ఞచేసి, ప్రాకారం కింద తన నాగలి వేసి ఎత్తనారంభించాడు.

దుర్యోధనుడు మొదలైన వాళ్ళంతా బెదిరిపోయి, సాంబుణ్ణి తెచ్చి బలరాముడికి అప్పగించి, శాంతింపజేశారు. అప్పుడే దుర్యోధనుడు బలరాముడికి తాను శిష్యుడుగా ఉంటానని చెప్పి, గురుపూజ చేశాడు. బలరాముడి మూలాన హస్తినాపురం శాశ్వతంగా ఒక పక్క పైకి లేచి, రెండోవైపు ఏటవాలుగా ఉండిపోయింది. దుర్యోధనుడు బలరాముడి శిష్యుడుగా గదాయుద్ధంలో సాటిలేని కీర్తి సంపాదించాడు.

ఇది ఇలా ఉండగా రాక్షస ప్రపంచంలో నరకుడనేవాడు ప్రచండుడుగా పైకి వచ్చాడు. అతని రాజధాని ప్రాగ్జ్యోతిషపురం. అతను భూదేవి కొడుకు. బ్రహ్మ చేత వరాలు పొందినవాడు. ఏ దేవతలకూ ఓడేవాడు కాడు. అన్ని లోకాలనూ తన బల పరాక్రమాలతో హడలగొట్టసాగాడు.



నరకుడు ముందుగానే ఇంద్రుడి నగరానికి తన రాక్షససేనతో సహా వెళ్ళి, నగర ద్వారాలను తన పిడికిలి పోట్లతో పగలగొట్టి, సింహనాదం చేసి, యుద్ధానికి రమ్మని ఇంద్రుణ్ణి పిలిచాడు. ఇంద్రుడు వచ్చాడు. వజ్రాయుధం చేతబట్టి, ఐరావతాన్ని ఎక్కి వచ్చిన ఇంద్రుణ్ణి ఏమాత్రమూ లక్ష్యపెట్టక, నరకుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. ఇంద్రుడికి తోడుగా యమ, వరుణ, కుబేరులు తమ సైన్యాలను తెచ్చి, యుద్ధంలో పాల్గొన్నారు.

నరకుడికి కూడా ముగ్గురు రాక్షస నాయకులు, హయగ్రీవుడూ, నిశుంభుడూ,



మురుడూ అనేవాళ్ళు, తోడుగా ఉన్నారు. వారిలో హయగ్రీవుడితో వరుణుడు యుద్ధం చేసి, తల పగిలి, నెత్తురు కక్కుతూ, మూర్ఛపోయి, స్పృహ తెలియగానే పారిపోయాడు. వరుణుడితోనే అతని సేన కూడా పోయింది. అలాగే నిశుంభుడి చేతిలో యముడూ, మురాసురుడి చేతిలో కుబేరుడూ చావుదెబ్బలు తిని, సైన్యాలతో సహా పారిపోయారు. చివరకు నరకుడి దెబ్బకు తట్టుకోలేక ఇంద్రుడు కూడా పారిపోయాడు. నరకుడు అమరావతీ నగరం ప్రవేశించి, తన విజయాన్ని దేవలోకమంతటా చాటింపు చేయించాడు.

తరవాత నరకుడు ఇంద్రుడి సింహాసనం అధిష్ఠించి, ఊర్వశిని పిలిపించి, "దిక్పాలకు లందరినీ ఓడించాను. సమస్త దేవతలకూ ఇక నేనే రాజును. అందుచేత ఇకనుంచీ నన్ను నువు నృత్యగానాలతో మురిపించు," అన్నాడు.

దానికి ఊర్వశి, "అలాగా? అయితే మునులందరూ యజ్ఞాలలో నిన్నే పూజించినట్టయితే నేను నీ కోరిక తీరుస్తాను," అన్నది. నరకుడు సరేనన్నాడు. అతడు అమరావతిని కొల్లగొట్టి, సుమేరు పర్వతంలోని రత్నరాసులన్నీ తవ్వించి, ఎనిమిది వేల దేవకన్యలను చెరపట్టి, విశ్వకర్మ కూతురిని కూడా తీసుకుని, రత్నాలు పొదిగిన అదితికుండలాలు సంగ్రహించి, తన నగరానికి తిరిగి వచ్చాడు.

నరకుడి అజ్ఞపొంది అతని అనుచరులైన రాక్షసులు పద్నాలుగు లోకాలలోనూ, ఎక్కడ ఏ విలువగల వస్తువున్నా, దాన్ని తెచ్చి అతనికి ఇస్తూ వచ్చారు. వాళ్ళు అప్సరస్త్రీల నందరినీ తెచ్చారు, పదహారు వేల ఒక వంద గంధర్వకన్యకలనూ, అనేక లక్షల యక్షస్త్రీలనూ, అసంఖ్యాకులైన కిన్నర, సిద్ధ, సాధ్య, విద్యాధర స్త్రీలనూ చెరపట్టి తెచ్చారు.

ప్రాగ్జ్యోతిషనగరాన్ని నాలుగు పక్కలా నలుగురు మహాయోధులు—మురుడూ,



హయగ్రీవుడూ, నిశుంభుడూ, పంచ జనుడూ రక్షించేవారు. మురాసురుడికి వేల సంఖ్యలో కొడుకులుండేవారు. వాళ్ళ మూలాన నరకుడి నగరం ఎలాటివారికీ చొరరానిదిగా ఉండేది.

నరకుడికి భూలోకమంతా వశపరచుకోవాలనిపించింది. అతను అంతటా తిరుగుతూ, యజ్ఞాలు ధ్వంసం చేశాడు, బ్రాహ్మణులను చంపాడు, మునులను హింసించాడు, రాజు లందరినీ రకరకాలుగా పీడించాడు, ధర్మనాశనాన్నే తన ఆశయంగా పెట్టుకున్నాడు.

ఒకసారి నరకుడు బదరీవనానికి వెళ్ళే సరికి అక్కడ అనేకమంది ఋషులు యజ్ఞకార్యంలో మునిగి ఉన్నారు. అప్పుడు నరకుడికి ఊర్వశి అన్న మాట జ్ఞాపకం వచ్చింది. అతను వాళ్ళను, "ఎవరిని తలపెట్టి ఈ యజ్ఞం చేస్తున్నారు?" అని అడిగాడు.

"వేదాలు చెప్పిన విధంగా ఇంద్రుణ్ణి గురించి యజ్ఞం చేస్తున్నాం." అని వాళ్ళు జవాబు చెప్పారు.

ఈ మాటకు నరకుడు అలిగి, "మీ ఇంద్రుణ్ణి, వరుణ యమ కుబేర సహితంగా నేను యుద్ధంలో ఓడించాను. అతని రాజ్యమంతా గెలుచుకున్నాను. విశ్వానికంతకూ నేనే ఏలికను. అందుచేత నన్నే కొలవండి, నాకే మొక్కండి. నన్ను సంతృప్తిపరచినట్టయితే నేను మీ కోరికలు తీర్చుతాను," అన్నాడు.

దానికా ఋషులు, "ఈ మాట ఎంత మాత్రమూ సబబుగా లేదు. లోకాలను పాలించవలసినవాడు ఇంద్రుడు. నువు దుష్ట రాక్షసుడివి. నిన్ను మే మెలా కొలుస్తాం?" అన్నారు.

నరకు డీ మాటకు మండిపడి తన బంట్లతో, "ఈ మునులు మదమెక్కి కారుకూతలు కూస్తున్నారు. వీళ్ళ యజ్ఞం ధ్వంసం చెయ్యండి," అన్నాడు. వెంటనే రాక్షసులు అగ్నికుండాలు పూడ్చి, పశువులను నాశనం చేసి, హోతలనూ, ఉద్గాత

లనూ, సదస్యులనూ చావగొట్టి, స్రుక్స్రువాలను అవతల పారేసి, అరణులు కాల్చి, హవిస్సులు తినేసి, అన్నపురాసులు చిమ్మేసి, సోమరసాన్ని బూడిదపాలుచేసి, నానా బీభత్సమూ చేశారు. తరవాత నరకుడు తిరిగి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత వసిష్ఠుడూ, వామదేవుడూ, కపిలుడూ, కశ్యపుడూ, కణ్వుడూ, జాబాలీ, ధూమ్యుడూ, భరద్వాజుడూ, మంకణుడూ మొదలైన మహా ఋషులందరూ కూర్చుని, తమ యజ్ఞం ఇలా ఎందుకు విఘ్నమయిందో, ఇటువంటి దుర్మార్గుడి నుంచి తమను కాపాడేవాడు ఎవడో ఒకడు లేకపోతే ఇక బ్రతుకే ఉండదు. అవతారపురుషుడైన కృష్ణుడివల్లనే తమకు గతి ఏర్పడాలని వారు నిశ్చయించుకుని, అందరూ కలిసి ద్వారకకు బయలుదేరారు.

వారు దక్షిణాభిముఖులై ప్రయాణం చేసి, దారిలో తగిలిన తీర్థాలలో స్నానాలు చేస్తూ, భాగీరథిని చేరి, అందులో కూడా స్నానం చేసి, ప్రాయశ్చిత్తాలు చేసుకుని, నిత్యప్రయాణాలు చేస్తూ, స్వర్గాన్ని మించిన వైభవంతో తులతూగే ద్వారకా నగరాన్ని చేరుకున్నారు.

ఆ నగరంయొక్క ఐశ్వర్యానికి ఆశ్చర్యపడుతూ, వాళ్ళు రాజమార్గం వెంట రాచనగరు చేరుకుని, బదరీవనం నుంచి మహర్షులు వచ్చారని కృష్ణుడికి కబురు పంపారు.



కృష్ణుడు వారి రాక గురించి వినగానే ప్రద్యుమ్నుణ్ణి పిలిచి, ఋషులకు స్వాగతం చెప్పి తీసుకురమ్మని పంపాడు. ప్రద్యుమ్నుడు బయటికి వచ్చి, ఆదరంతో ఋషులకు స్వాగతం చెప్పి, వారిని కృష్ణుడు కొలువుదీరి ఉన్న చోటికి తీసుకు వెళ్ళాడు.

సభాభవనంలో యాదవులందరూ తనను కొలిచి ఉండగా, కృష్ణుడు ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. మునులు అతన్ని చూసి, "మన కోరికలన్నీ తీర్చి రక్షించటానికి అతను ఉండగా, మనం ఇన్నాళ్ళూ ఆ రాక్షసుడి చేత ఎందుకని అంతగా అవమానాలు పొందినట్టు? ప్రారబ్ధమంటే ఇలాగే ఉంటుందిగదా! పోనీ ఇప్పటికైనా ఈ మహాత్ముడి దర్శనం చేసుకున్నాం. తపస్సు, తపస్సు అంటూ అడవుల్లో అలమటించే మనకు ఆ రాక్షసుడి మూలంగా ఈ లాభం ఒకటి కలిగింది," అని తమలో అనుకుంటూ కృష్ణుణ్ణి సమీపించారు.

కృష్ణుడు గబగబా తన ఆసనం నుంచి దిగి వచ్చి, మునులకు నమస్కారం చేసి, వారికి ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించి, వారి అనుమతి పొంది, తిరిగి తన ఆసనం మీద కూర్చున్నాడు.

అతని తరవాత మిగిలిన యాదవ ప్రముఖులంతా మునులకు నమస్కారాలు చేసి తమ తమ ఆసనాలలో తిరిగి కూర్చున్నారు.

అప్పుడు కృష్ణుడు చేతులు జోడించుకుని మునులతో, "మీ క్రతువులు నిర్విఘ్నంగా సాగుతున్నాయా? మీ వ్రతాలూ, తపస్సులూ యథావిధిగా జరుగుతున్నాయి గదా? మీరంతా ఇలా దయచేయటానికి కారణమేమిటి? నా మీద గల అనుగ్రహం కొద్దీ, నన్ను కృతార్థుణ్ణి చేయటానికే మీరిలా వచ్చి ఉంటారు. నాకు మీ రందరూ ఏదైనా పని చెప్పినట్టయితే, ఆ పని చెయ్యటానికి మేమంతా సంసిద్ధంగా ఉన్నాం," అన్నాడు.





# ఒకే గుంట - ఒకే దేవుడు

ఒక మండువేసవికాలంలో, బాటసారి ఒకడు శిళ్ళంగేరి గ్రామంలోని, ఒక వీధి గుండా పోతున్నాడు. అతడికి బాగా దాహంగా వుండడంతో, ఒక ఇంటిముందు నిలబడి, మంచినీళ్ళివ్వమని గట్టిగా కేక వేశాడు.

ఆ సమయంలో ఇంటి యజమాని, తలుపులు మూసి, లోపల పూజలో వున్నాడు. అయన, ఆ కేక విని, ''కొంచెం ఆగండి! నేను పూజలో వున్నాను. అరుగుపైన కూర్చోండి. పూజ ముగిసిన వెంటనే నీళ్ళిస్తాను,'' అన్నాడు.

బాటసారి అరుగుపైన కూర్చున్న కొంత సేపటికి, లోపలి నుంచి హారతి గంట వినబడింది. పూజ ముగిసిపోయిందని, బాటసారి సంతోషించాడు. అయితే, నిముషాలు గడుస్తున్నా, ఎవరూ తలుపు తెరుచుకుని బయటికి రాలేదు. తన సంగతి మరిచిపోయారనుకుని, బాటసారి మళ్ళీ మంచినీళ్ళకోసం కేక వేశాడు.

''ఇప్పుడే గణపతి పూజ ముగిసింది. మిగతా దేవుళ్ళ పూజ మొదలు పెట్టాను. కొంచెం సేపాగండి!'' అంటూ లోపలి నుంచి జవాబు వచ్చింది.

తరవాత చాలాసేపటివరకు లోపలి నుంచి ఎటువంటి శబ్దమూ రాలేదు. ఆ పిమ్మట గణగణమని హారతి గంట వినిపించింది. బాటసారి కొద్దిసేపు ఆగి, మంచినీళ్ళకోసం మళ్ళీ కేక వేశాడు.

''ఇప్పుడే నవగ్రహపూజ ముగిసింది. మిగతా దేవుళ్ళ పూజ పూర్తిచేసి నీళ్ళు తెస్తాను. కాస్త ఓపిక పట్టండి,'' అని లోపలి నుంచి జవాబు వచ్చింది.

తర్వాత కొంతసేపటికి హారతి గంట మోగింది. కొద్దిసేపు ఆగి, బాటసారి మళ్ళీ మంచినీళ్ళకోసం కేక వేశాడు.

కోలార్ కృష్ణ అయ్యర్

"ఇప్పుడే వెంకటేశ్వరస్వామి పూజ అయింది. మిగతా దేవుళ్ళ పూజ ముగియగానే, మంచినీళ్ళు తెస్తాను. కాస్త ఆగండి!" అని జవాబు వచ్చింది.

ఈ విధంగా ప్రతిసారీ, ఒక్కొక్క దేవుడి పూజ ముగిసిందని చెబుతూ మిగతా దేవుళ్ళ పూజ కూడా అయాక, మంచి నీళ్ళు తెస్తానని ఇంటి యజమాని నుంచి జవాబు రాసాగింది.

బాటసారికి దాహంతో గొంతు ఎండి పోతున్నది. అతడు ఏమీ చేసేందుకూ తోచక, అక్కడ కనిపించిన పలుగోకటి తీసుకుని, గంట మోగినప్పుడల్లా, అరుగుకు దిగువున వీధి పక్కగా, ఒక్కొక్క గుంట తవ్వసాగాడు.

మరి కొంతసేపటికి పూజ ముగించుకుని, ఇంటి యజమాని మంచినీళ్ళతో బయటికి వచ్చాడు.

ఆయనకు బాటసారి తీసిన గుంటలు కనిపించగానే, ఆశ్చర్యపోతూ అతడికేసి చూశాడు.

బాటసారి ఏమాత్రం తొణక్కుండా, "అయ్యా, మీ అరుగుమీద కూర్చున్న నాకు ఏమీ తోచక కాలక్షేపం కోసం, మీరు హారతి గంట వాయించినప్పుడల్లా ఒక్కొ గుంట తవ్వాను. ఏమీ అనుకోకండి!" అన్నాడు.

అది విని ఇంటి యజమాని చాలా కోపంగా, "నీకేమన్నా మతిచలించిందా? అందంగా వున్న అరుగు దిగువున అన్ని గుంటలు తవ్వేశావు. నీకు అలా ఏమీ తోచకపోతే—ఆ తవ్వేదేదో ఒకచోట తవ్వి వుంటే, ఒక చిన్న బావి తయారై, నీ దాహం తీరేది!" అన్నాడు.

ఈసారి బాటసారికి కోపం వచ్చింది. అతడు ఇంటి యజమానితో, "మీరన్నది నిజమే! మీరూ అనేకమంది దేవుళ్ళకు బదులు, ఒకే దేవుడికి అంతసేపు పూజ చేసివుంటే, ఆ దేవుడు తప్పక సాక్షాత్కరించి వుండేవాడు!" అని మంచినీళ్ళు తాగి, అక్కడి నుంచి తిన్నగా వెళ్ళిపోయాడు.





# మోసగాళ్ళ గురువు

ఒకప్పుడు బాగ్దాదు నగరంలో ధనికుడైన వర్తకు డొకడుండేవాడు. ఆయన ప్రపంచమంతా తిరిగి వచ్చాడు గాని, కొండల మధ్య ఉండే ఒక నగరానికి ఎన్నడూ వెళ్ళలేదు. ఆ నగరం నుంచి వచ్చిన ఒక బాటసారిని ఆయన కలుసుకోవటం తటస్థించింది.

''ఆ నగరంలో ఏ వస్తువులకు ఎక్కువ గిరాకీ ఉంటుంది?'' అని వర్తకుడు బాటసారిని అడిగాడు. చందనపు చెక్కకు మంచి ధర వస్తుందని బాటసారి చెప్పాడు.

సరే, వర్తకుడు తనవద్ద ఉన్న డబ్బుతో దొరికినంత చందనపు చెక్క కొని దాన్ని తీసుకుని కొండలమధ్య ఉండే నగరానికి బయలుదేరాడు. ఆయన నగరాన్ని చేర వస్తుండగా, ఒక ముసలిది తన గొర్రెలను తోలుకువస్తూ ఎదురుపడి, ఆయన పరదేశీ వర్తకుడని తెలుసుకుని, ''జాగర్త, నాయనా! ఈ నగరంలో వాళ్ళు వట్టి దొంగలు. పరదేశీలను మహా మోసగిస్తారు!'' అని హెచ్చరించి తన దారిన తాను వెళ్ళిపోయింది.

వర్తకుడు నగరద్వారం చేరేసరికి పూర్తిగా చీకటి పడింది. ద్వారం మూసేశారు. తెల్లవార్లూ బయటనే గడిపి, ఆయన మర్నాడు నగరద్వారం దాటాడో లేదో ఒక మనిషి పలకరించి ప్రశ్నలు వేశాడు.

''మాది బాగ్దాదు. ఈ నగరంలో చందనపు చెక్కకు మంచి ధర ఉన్నదని విని ఆ సరుకు అమ్మకానికి తెచ్చాను.'' అని వర్తకుడు చెప్పాడు.

''ఎవరా చెప్పినవాడు? మాకు చందనం కర్ర వంటచెరుకుగా తప్ప పనికి రాదు. వంటచెరుకుకు ఎవరన్నా పెద్ద ధర పెడతారా?'' అంటూ కొత్తవాడు తన దారిన తాను వెళ్ళాడు.

అరేబియా జానపద కథ



ఈ మాట కూడా నిజమో, అబద్ధమో వర్తకుడు తేల్చుకోలేక పోయాడు. ఆయన తన సరుకుతో సహా ఒక వంట పూటి ఇంటికి వెళ్ళి అక్కడ బస తీసుకున్నాడు. తరవాత ఆయన ఆ ఇంటి ఆవరణలోకి రాగా ఒక వింత దృశ్యం కనబడింది. నగర ద్వారం వద్ద తనను పలకరించిన వాడూ, మరొకడూ కలిసి అరుబయట పొయిపెట్టి వంట చేస్తున్నారు. వారు వంట చెరుకుగా వాడుతున్నవి చందనపు కర్రలే!

ఇది చూడగానే వర్తకుడి గుండె జారిపోయింది. ఆ మనిషి చెప్పినది నిజమే; ఈ నగరంలో చందనాన్ని వంట చెరుకుగా వాడతారు. తన సరుకంతా అమ్మినా కొద్దిపాటి వెండి తప్ప రాదు.

వర్తకుడు దగ్గిరికి వచ్చాక ఆ మనుషులు, "మీ సరుకు అమ్ముతారా?" అని అడిగారు.

"దానికి ఏమిస్తారు?" అని వర్తకుడు అడిగాడు.

"అదే బరువుగల సరుకు మీరు ఏది అడిగినా ఇస్తాం," అన్నారు వాళ్ళు. అందుకు సమ్మతించి వర్తకుడు తాను తెచ్చిన చందనం కర్రల కట్టలు వారికి ఇచ్చేశాడు.

తరవాత ఆయన నగరం చూడటానికి బయలుదేరాడు. దారిలో ఒక ఒంటికన్నువాడు ఆయనను సమీపించి, చెయ్యి గట్టిగా పట్టుకుని, "ఇడుగో, నా కన్ను పోగొట్టిన వాడు! ఈసారి తప్పించుకు పోలేవులే!" అని కేకలు పెట్టాడు.

నలుగురూ చుట్టూ మూగారు. "నువ్వెవరో, నేనెరగను. ఈ క్షణం దాకా నిన్ను చూడనైనా లేదు. నేనీ ఊరికి రావటం ఇదే మొదటిసారి. నీ కన్ను నేను పోగొట్టానంటావేమిటి?" అని వర్తకుడు ఆశ్చర్యంగా అడిగాడు, విడిపించుకోవటానికి ప్రయత్నిస్తూ.

కాని, చుట్టూ మూగినవాళ్ళు ఒంటికన్నువాడి పక్షమై, వర్తకుడు వాడికి

పరిహారం ఇవ్వాలని నిర్ణయించారు. ఆ సంగతి, రేపు చూద్దామని చెప్పి వర్తకుడు అప్పటికి తప్పించుకున్నాడు.

అయితే, ఈ రద్దీలో వర్తకుడి కాలి చెప్పులలో ఒకటి తెగిపోయింది. ఆయన దాన్ని ఆ సమీపంలోనే ఉన్న చెప్పులు బాగుచేసేవాడికిచ్చి, బాగు చెయ్యమన్నాడు.



"ఏమిస్తారు?" అని అడిగాడు చెప్పులు బాగుచేసేవాడు.

"నిన్ను సంతోషపెడితే సరిగద!" అన్నాడు వర్తకుడు. అందుకు చెప్పులు బాగుచేసేవాడు సమ్మతించాడు.

ఒక కాలికి చెప్పు లేకుండా నడవటం కష్టం గనక, వర్తకుడు ఆ సమీపంలోనే ఎవరో జూదమాడుతుంటే వినోదం చూస్తూ నిలబడ్డాడు. కొద్దిసేపు గడిచాక, పక్కన నిలబడిన మనిషి వర్తకుణ్ణి కూడా పందాలు కాయమన్నాడు. వర్తకుడు జూదం ఆడి కొద్దిసేపట్లోనే అక్కడి జూదరుల కందరికీ బాకీ పడ్డాడు. ఆయనను జూదంలోకి దించిన మనిషి, "సముద్రంలో నీరంతా తాగుతావా? లేక నీకున్నదంతా మాకు ఇచ్చుకుంటావా? ఏదో ఒకటి నిర్ణయించుకో," అన్నాడు.

"నాకు రేపటిదాకా గడువిస్తే నిర్ణయించుకుంటాను," అని వారితో చెప్పి వర్తకుడు, తనకు ఏర్పడిన దుస్థితి తలుచుకుని విచారపడుతూ, నగర వీధుల వెంట నడవసాగాడు.

ఆయనకు ఒక చోట ముసలిది మళ్ళీ ఎదురయింది. వర్తకుడి ముఖం చూడగానే, ఏదో జరిగిందని ఆమెకు తెలిసిపోయింది. ఆయన ఆమెతో తన అనుభవాలన్నీ పూస గుచ్చినట్టు చెప్పాడు.

అంతా విని ఆమె, "చూశావా, నాయనా? ఈ నగరపు మనుషులు వట్టి పాపిష్టివాళ్ళు. నేను ముందే చెప్పినా నీవు వారి మోసానికి గురి అయావు. ఈ నగరంలో చందనపు కట్టకు పది బంగారు మాడల ధర ఉన్నది. నీ దగ్గిర ఉన్న



చందనమంతా అమ్మితే అంతులేని బంగారం రావలిసింది. అయిందేదో అయింది. ఇప్పుడైనా నేను చెప్పినట్టు చేశావంటే నీకు జరిగిన అన్యాయం కొంతవరకైనా సరికావచ్చు. చీకటి పడే వేళకు నగర ద్వారం వద్దకు వెళ్ళావంటే అక్కడ నిర్జన ప్రదేశంలో ఒక గుడ్డి సాధువు కనిపిస్తాడు. నిజానికి వాడు సాధువు కానేకాడు; వాడు ఈ నగరంలో ఉండే మోసగాళ్ళ కందరికీ గురువు. చీకటి పడ్డాక మోసగాళ్ళు వచ్చి వాడి దగ్గిర సలహాలు పుచ్చుకుని, తాము చేసిన మోసాలన్నీ వాడికి చెప్పి వెళతారు. నువు అక్కడికి వెళ్ళి రహస్యంగా వాళ్ళ సంభాషణ ఆలకిస్తే కొంత లాభించవచ్చు.'' అన్నది.

ఇంకా చీకటి పడకమునుపే వర్తకుడు నగరద్వారం కేసి వెళ్ళాడు. ద్వారం వెలపల ఒక గుడ్డి సాధువు, ముసలిది చెప్పినట్టే, ఒక రాతిని ఆనుకుని సమాధిలో ఉన్నట్టుగా కూచుని ఉన్నాడు.

వర్తకుడు వెళ్ళి ఆ రాతి వెనక దాగాడు.

చీకటి పడగానే నగరంలోని మోసగాళ్ళు ఒక్కరొక్కరే భక్తుల్లాగా వచ్చి సాధువు ముందు కూచుని తాము చేసిన మోసాలు నివేదించసాగారు. వారిలో వర్తకుణ్ణి మోసగించిన నలుగురూ ఉన్నారు. ఒక్కొక్కరు చేసిన మోసమే విన్నాక సాధువు వారి తెలివితేటలను విమర్శిస్తూ వచ్చాడు. ఆ విమర్శలన్నీ వర్తకుడు వింటున్నాడు.

మోసగాళ్ళలో ఒకడు, ''స్వామీ, ఇవాళ ఒక పరదేశి వర్తకుడి దగ్గిర అతి చౌకగా చందనం కొన్నాను,'' అన్నాడు.

''ఏ ధరకు కొన్నావు?'' అని సాధువు అడిగాడు.

''చందనం బరువుగలది వర్తకుడు ఏది అడిగినా ఇచ్చేషరతుమీద కొన్నాను.'' అన్నాడు మోసగాడు.

''వర్తకుడికే లాభం!'' అన్నాడు సాధువు.

"అదేమిటి, స్వామీ? ఆ వర్తకుడు చందనం ఎత్తు బంగారం అడిగినా నాకే లాభం గదా!" అన్నాడు మోసగాడు ఆశ్చర్యంగా.

"అవును. కాని వాడు ఆ చందనం ఎత్తు ఈగలను ఇవ్వమనీ, అందులో సగం ఆడవీ, సగం మగవీ ఉండాలనీ అంటే నీ గతి ఏమవుతుంది?" అన్నాడు సాధువు.

మోసగాడు దిగులుపడి వెళ్ళిపోయాడు.

తరవాత ఒంటికన్నువాడు, ముందుకు వచ్చి, "స్వామీ, ఇవాళ ఒక పరదేశి వర్తకుణ్ణి మోసగించాను. నా కన్ను ఇతనే పొగొట్టాడని ఫిర్యాదు చేశాను. నాకా మనిషి తన కన్నయినా ఇవ్వాలి, లేదా తనకున్నదంతా ఇవ్వాలి," అన్నాడు.

"నీవు మూర్ఖుడివి! ఆ వర్తకుడు నిన్ను సులువుగా టోపీ వేసేస్తాడు. నువు చెప్పేది నిజమని రుజువు చెయ్యటానికి నీ కన్నొకటీ, తన కన్నొకటీ త్రాసులో వేసి తూచి సమంగా ఉంటే నీ మాట నమ్ముతా నంటాడనుకో. నీ గతి ఏమవుతుంది? నీకు రెండో కన్ను కూడా పోయి గుడ్డివాడి వవుతావు. అతని కింకా ఒక కన్ను మిగిలి ఉంటుంది," అన్నాడు సాధువు. ఒంటికన్నువాడు మండిపడుతూ వెళ్ళిపోయాడు.

తరవాత చెప్పులు కుట్టేవాడు సాధువుతో, "స్వామీ, ఒక పరదేశివాడు ఇవాళ



నా చేత చెప్పు బాగు చేయించుకుని నన్ను సంతోష పెడతానన్నాడు. వాడి దగ్గిర ఉన్నదంతా కాజేస్తాను.'' అన్నాడు.

''నీకు కొంచెం కూడా బుద్ధిలేదు. ఆ వర్తకుడు నీకు రాగి డబ్బు కూడా ఇవ్వడు. వాడు నీతో ఏమంటాడంటే, 'మన సుల్తానుగారి శత్రువులంతా సర్వ నాశనమైపోయారు. ఆయనను ఎదిరించే వాడు ప్రపంచంలో లేడు. ఈ మాట విని నీకు సంతోషమయిందా?' అంటాడు. సంతోషమయిందని చచ్చినట్టు అంటావు; అనకపోతే రాజభటులు నిన్ను చిత్రవధ చేస్తారు!'' అన్నాడు సాధువు. చెప్పులు కుట్టేవాడు గొణుక్కుంటూ వెళ్ళి పోయాడు.

తరవాత జూదగాడు ముందుకు వచ్చి, ''స్వామీ, ఇవాళ ఒక పరదేశిని జూదంలో ఓడించాను. వాడు సముద్రంలో ఉన్న నీరంతా తాగాలనీ, లేకపోతే తన కున్న దంతా నా కిచ్చెయ్యాలనీ షరతు పెట్టాను.'' అన్నాడు.

''ఆ మనిషి నీకు చిల్లిగవ్వ ఇవ్వడు. సముద్రంలో ఉండే నీరంతా నీ దోసిట్లో పట్టి తెస్తే తాగుతానన్నాడనుకో? నీ గతి ఏమిటి?'' అన్నాడు సాధువు.

ఈ సంభాషణలన్నీ వర్తకుడు విని ఉన్నాడు గనక, మర్నాడు తనను మోస గించిన నలుగురినీ సులువుగా మోస గించాడు. చందనం ఎత్తు ఈగలను, అందులోనూ సగం ఆడవీ, సగం మగవీ ఉండేటట్టు, ఇవ్వలేక మొదటి మోసగాడు చందనం కట్టకు పది బంగారు మాడల వంతున డబ్బిచ్చుకున్నాడు. అదే విధంగా మిగిలిన ముగ్గురూ ఆయనకు సమాధానం చెప్పలేక క్షమాపణలు చెప్పుకుని తమ దారిన తాము వెళ్ళారు. వర్తకుడు తనకు రావలిసిన డబ్బంతా వసూలు చేసుకుని, నగరమంతా వెతికి ఆ ముసలిదాన్ని పట్టు కుని ఆమెకు కొంత బంగారం బహుమా నంగా ఇచ్చి, ఇక జన్మలో ఆ నగరంలో అడుగు పెట్టకూడదనుకుంటూ బాగ్దాదుకు తిరిగి వెళ్ళిపోయాడు.





# లంకెబిందెలు

ఒక జమీందారుగారి గ్రామంలో ఒక నిరుపేద రైతు ఉండేవాడు. వాడి దుస్థితి చూసి జమీందారు వాడికి గ్రామానికి దూరంలో వున్న కొద్దిపాటి బంజరుపొలం ఇచ్చి, బతికి ఉన్నంతకాలమూ అనుభవించమన్నాడు.

ఒకనాడు రైతు తన చెక్క దున్నుతూ ఉండగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. అక్కడ తవ్విచూస్తే లంకెబిందెలు కనబడ్డాయి. వాటినిండా బంగారు కాసులున్నాయి.

ఆ బిందెలను ఎలాగైనా, పరాయివాడి కన్ను పడకుండా, ఇంటికి చేర్చుకుంటే తన దరిద్రం తీరిపోతుంది. ఈ లంకెబిందెల మాట మరోప్రాణి చెవిని పడిందో వాటిలో ఒక్క కాసు కూడా తనకు దక్కదు; అంతా జమీందారు చెవులు మెలేసి తీసుకుంటాడు.

అయితే, ఆ బిందెలు చాలా బరువున్నాయి. తాను ఒక్కడూ వాటిని ఇంటికి చేర్చటం అసంభవం. తన భార్య కూడా సహాయపడాలి. కాని దానినోట నువుగింజ నానదు. అది వొట్టి వెర్రిబాగులది.

రైతు ఎంతోసేపు దీర్ఘంగా ఆలోచించి చివరకు కర్తవ్యం నిర్ణయించుకున్నాడు. చీకటిపడగానే వాడు కొన్ని చేపలూ, ఒక కోడీ కొన్నాడు. చేపలను తెచ్చి తన దొడ్లో ఉన్న ఉచ్చులలో పెట్టాడు. కోడి పెట్టను తీసుకుపోయి చెరువులో వేసిన వలలో పెట్టేశాడు. తరవాత ఖాళీ చేతులతో ఇంట్లోకి వెళ్ళాడు.

"ఎప్పుడూ ఉత్తచేతులు లాడించుకుంటూ వస్తావు. వంట ఏం చెయ్యను?" అని పెళ్ళాం లబలబలాడింది.

"ఊరికే అరవకు. దొడ్లో ఉచ్చులు వేశాను. ఏమైనా పడ్డాయేమో చూద్దాం

25–ఏళ్ళనాటి చందమామ కథ



పద. చెరువులో వలవేసి వచ్చాను. అందులో కూడా ఏమైనా చిక్కి ఉండొచ్చు.'' అన్నాడు రైతు.

ఇద్దరూ బయలుదేరారు. ఉచ్చుల్లో చేపలు దొరికాయి, వలలో కోడి చిక్కింది. ''ఎంత చిత్రం! ఎంత చిత్రం!'' అన్నది రైతు పెళ్ళాం.

''ఇదేం చూశావు? ఇంతకన్న చిత్రం చెబుతా విను. మన పొలంలో లంకె బిందెలు దొరికాయి. అర్ధరాత్రివేళ మనం పోయి వాటిని తెచ్చుకోవాలి. ఎవరికీ తెలీరాదుసుమా. తెలిస్తే ఆ బిందెల్లో ఉన్న బంగారం మనకు దక్కదు. జాగర్త!'' అన్నాడు రైతు.

ఇద్దరూ చీకట్లోపడి పొలానికి వెళ్ళారు. అక్కడ ఒకచోట ఎర్రనీళ్ళూ, ఒక మండా సిద్ధంగా ఉంచాడు రైతు. ఆ చీకట్లో వాడు మండను ఎర్రనీళ్ళలో ముంచి తన పెళ్ళాం మీద విదిలించాడు.

''వాన కురుస్తోందేమిటీ?'' అంటూ పెళ్ళాం తల ఎత్తి చూసింది. ఎక్కడా చిన్న మబ్బుతునక కూడా లేదు. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి.

''మబ్బు లేకుండా వాన ఏమిటీ?'' అన్నది రైతు పెళ్ళాం.

''మబ్బు లేని వాన నెత్తురువాన! నీకు తెలీదా?'' అన్నాడు రైతు.

''అట్టాగా?'' అన్నది రైతు పెళ్ళాం.

తరవాత ఇద్దరూ లంకెబిందెలు మోసుకుని ఇంటికి బయలుదేరారు. వాళ్ళు జమీందారుగారి ఇంటి వెనకగా వచ్చేటప్పుడు రెండు మూడు ఆవులు మూలిగినట్టుగా అరిచాయి. ''అదేమిటీ?'' అన్నది రైతు పెళ్ళాం భయంతో.

''ఏం లేదులే. జమీందారుగారిని దయ్యాలు ఎత్తుకుపోయాయట. అందుకని నౌకర్లు ఏడుస్తున్నారు,'' అన్నాడు రైతు.

''అట్టాగా?'' అన్నది రైతు పెళ్ళాం మళ్ళీ ఆశ్చర్యంగా.

మొగుడు పెళ్ళాలిద్దరూ ఏ విఘ్నమూ లేకుండా ఇల్లు చేరుకున్నారు. లంకెబిందె

లను ఒకచోట పాతిపెట్టారు. రైతు పెళ్లాం అలిసి ఉండటంచేత వెంటనే నిద్ర పోయింది. రైతు మాత్రం మేలుకుని ఉంది, లంకెబిందెలను మళ్ళీ తవ్వి తీసి, బంగారం ఒకచోటా, బిందెలను మరొకచోటా పాతిపెట్టి తాను కూడా నిద్ర పోయాడు.

తెల్లవారి లేస్తూనే పెళ్ళాం రైతుతో, "నాకు కాసిని కాసులిస్తావా ? మంచి చీరెలూ, నగలూ కొనుక్కుంటాను. మనం ఇప్పుడు డబ్బుగలవాళ్ళం గదా!" అన్నది.

"పిచ్చిదానా, మనం ఎడాపెడా బంగారం వాడుతుంటే మన రహస్యం అందరికీ తెలిసిపోదూ ?" అన్నాడు రైతు.

ఇద్దరూ మాటామాటా అనుకుని చివరకు పోట్లాడుకున్నారు.

రైతుపెళ్ళాం బావి దగ్గిరకు వెళ్ళి. పొరుగింటావిడ కనపడ్డ మరుక్షణమే. "నా మొగుడెంత పిసినిగొట్టో చూశావు టమ్మా ?" అన్నది.

"ఎందుచేతా ?" అన్నది పొరుగావిడ.

"మళ్ళీ ఎవరితోనూ అనవ్వాకు: మాకు పొలంలో లంకెబిందెలు దొరికాయి. వాటి నిండా బంగారపు కాసులు! కోకలు కొంటానంటే నా మొగుడు ఒక్క కాసు ఇస్తే ఒట్టు!" అన్నది రైతుభార్య.

మళ్ళీ రాత్రిపడే లోపుగా లంకెబిందెల వార్త గ్రామంలో చాలామందికి తెలిసి పోయింది. మరి రెండు మూడు రోజులకు



ఈ మాట జమీందారుగారిదాకా వెళ్ళింది. ఆయన ఉగ్రుడై రైతు ఇంటికి వచ్చి, ''దుర్మార్గుడా! నమ్మకద్రోహీ! పాపం గదా అని నీకు పొలం చేసుకోమని ఇస్తే ఆ పొలంలో దొరికిన లంకెబిందెలు కాజేస్తావా? అవి నీ బాబుగాడి సొమ్మా?'' అని రంకెలు పెట్టాడు.

రైతు లోపల బెదురుతున్నా పైకి తొణక కుండా, ''లంకెబిందెలేమిటి, బాబూ? మీతో ఎవరన్నారూ?'' అన్నాడు.

''నువ్వూ, నీ పెళ్ళామూ కలిసి ఆ లంకె బిందెలను తెచ్చుకున్నారటగా? ఊళ్ళో అందరికీ అదే చెప్పిందిట!'' అన్నాడు జమీందారు.

రైతు పెళ్ళాంకేసి చురచురా చూశాడు. ఆ పిచ్చిది మొగుడితో, ''అట్టా చూస్తావేం? నువ్వూ, నేనూ కలిసి లంకెబిందెలు పొలం నుంచి మోసుకురాలా? వాటినిండా బంగారపు కాసుల్లేవూ?'' అన్నది.

''అదెప్పుడూ?'' అన్నాడు రైతు ఆశ్చర్యం నటిస్తూ.

''నేను మరిచిపోయా ననుకున్నావా? ఆ రాత్రేగా మన ఉచ్చుల్లో చేపలు పడిందీ? చెరువులో వలేస్తే కోడి పడింది కూడాను!'' అన్నది భార్య. చుట్టూ మూగిన జనం ఈ పిచ్చి మాటలకు నవ్వ సాగారు.

''ఏం ఎందుకలా వింతగా నవ్వుతారు? ఆ రాత్రేగా మబ్బుల్లేకుండా నెత్తురువాన కురిసిందీ? అన్నట్టు అర్ధరాత్రివేళ జమీం దారుగారిని దయ్యాలెత్తుకుపోతే నౌకర్లం దరూ లబోమని ఏడిచారే!'' అన్నది రైతు పెళ్ళాం.

''ఛీ, మతిమాలిన ముండా!'' అని తిట్టి జమీందారు గబగబా బయటికి వెళ్ళి పోయాడు. లంకెబిందెల పుకారు కూడా వట్టి పుకారే అని ఆయనకు రూఢి అయి పోయింది.

చూడవచ్చినవాళ్ళు కూడా, రైతు పెళ్ళాం చెప్పే ఒక్కమాటా నమ్మటానికి లేదనుకుంటూ ఎవరిదారిన వారు వెళ్ళి పోయారు.



## ఎగిరే చేప



ఎగిరేచేప నిజంగానే గాలిలో ఎగరడం లేదు. గుండె కింద వున్న పొలుసుల వంటి రెక్కలు విప్పి, తోకతో నీళ్లను ఒక్క తోపు తోసి, ఆ వేగంతో పైకెగిరి 12–14 సెకండ్ల కాలం ఎగిరి మరొకచోట పడుతుంది।

## ఎత్తయిన చెట్లు



కాలిఫోర్నియాలోని కోస్ట్ రెడ్ వుడ్ (సీక్వోసెంపర్ వీరెన్స్) అనే జాతి చెట్లు ప్రపంచంలో అన్ని చెట్లకన్నా ఏపుగా పెరుగుతాయి. ఇవి 367.8 అడుగుల ఎత్తు వరకూ పెరిగాయి.

## తాబేళ్ల చిరాయువు!



వెన్నెముకగల జీవరాసులలో తాబేలు చిరకాలం బతుకుతుంది. కొన్ని తాబేళ్లు 180 సంవత్సరాల వరకు బతికినట్లు చెబుతారు. అయితే 116 సంవత్సరాలకు పైగా జీవించినట్లు మాత్రం గట్టి దాఖలాలు ఉన్నాయి।

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| 1. *Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity of Publication* | MONTHLY<br>1st of each calendar month |
| 3. *Printer's Name* | B. V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 4. *Publisher's Name* | B. VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 5. *Editor's Name* | B. NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| 6. *Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>**PARTNERS:**<br>**1. B. VENKATRAMA REDDY**<br>**2. B. V. SANJAY REDDY**<br>**3. B. V. NARESH REDDY**<br>**4. B. PADMAVATHI**<br>**5. B. VASUNDHARA**<br>**6. B. V. SHARATH REDDY**<br>**7. B. N. RAJESH**<br>**8. B. L. ARCHANA (Minor)**<br>**9. B. L. ARADHANA (Minor)**<br>**(Minors admitted to the benefits of Partnership)**<br>**'Chandamama Buildings'**<br>**188, N.S.K. Salai**<br>**Vadapalani, Madras-600 026** |

I, **B. Viswanatha Reddi**, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March 1989*

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 మే నెల సంచికలో ప్రకటింపబడును.



Anant Desai



Anant Desai

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రక్కనున్నది నేస్తం!

రెండవ ఫోటో : ఇంకెందుకు పుస్తకం?

పంపినవారు : జి. వి. కుమార్‌బాబు, రంగాచారి రోడ్డు, రాజమండ్రి.

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# "CRIPPLE"

## The word can maim a child for life.

Imagine not being able to race your best friend. Imagine not having a best friend. Imagine being struck by Poliomyelitis before you even know the word. Or what it means. And be called a "cripple" for life.

Every year, Poliomyelitis or Polio strikes 275,000 children in India. In rural India, 1 in every 150—200 surviving newborn is in danger of developing polio unless urgent preventive measures are taken. And, while you read this, there are 1.6 million polio-stricken children in the country, most of them handicapped for life. If only they had been immunized... in time.

**PolioPlus**
*The Rotarian Relief Programme*

Rotary International has embarked on a world-wide immunization programme called PolioPlus. Through this programme, Rotary will provide all polio vaccines necessary for upto 5 consecutive years, for children in countries around the world.

Plus immunization against common childhood diseases like measles, diphtheria, tuberculosis, tetanus and whooping cough—diseases which take 3.5 million young lives in the developing world, every year.

**PolioPlus**
A Rotary International Campaign
TO IMMUNIZE THE CHILDREN OF THE WORLD



*Cut and mail to :*
**Chairman**
**POLIOPLUS CAMPAIGN TRUST**
128, Golf Links
New Delhi-110 003.

**Here's what You Can Do**

YES, WE WISH TO SUPPORT THE POLIOPLUS CAMPAIGN TRUST

We enclose our Cheque/Draft of Rs. ...........

Name ....................................

..........................................

Designation ..............................

..........................................

Company Address ..........................

..........................................

Phone No. ................................

*Cheques/Drafts should be drawn in favour of POLIOPLUS CAMPAIGN TRUST payable in Bombay, Contributions are exempted from income tax under section 80 (G) of the Income Tax Act, 1961.*

*CMP*

*"YOU HAVE NOT DONE ENOUGH AS LONG AS YOU ARE CAPABLE OF DOING MORE."* ***ACT NOW.***

Everyday while a new India emerges, the existence and memory of the old one slowly fades.

The once-familiar sounds and sights, the beauty of Indian traditions and values, the ethnic and historical identity of its people, the once prolific art and handicrafts of rural India; a heritage is vanishing. Discover a part of that real India through the pages of The Heritage.




It's an unusual magazine. It has a vision for today and tomorrow.

It features ancient cities and contemporary fiction, culture and scientific developments, instead of filmstar interviews and political gossip. And it has found a growing readership, an IMRB survey reveals. Professionals, executives and their families are reading The Heritage in depth – 40% from cover to cover, 42% more than half the magazine.

More than 80% of The Heritage readers are reading an issue more than once.

And over 90% are slowly building their own Heritage collection.

Isn't it time you discovered why?

# THE HERITAGE

Annual Subscription : Rs. 96.00

Dolton Agencies, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026.

CMP-2155

# చందమామ అనుబంధం—5
# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### దారాషుకో

షాజహాన్ — ముంతాజ్‌ల పెద్దకుమారుడయిన దారాషుకో 1615 వ సంవత్సరం మార్చ్ 20 వ తారీఖున జన్మించాడు. తండ్రి అతనిపట్ల ఎంతో వాత్సల్యం కనబరచేవాడు. దారా, నాటి గొప్ప పండితులలో ఒకడుగా కీర్తిగాంచాడు. సత్యం ఏ ఒక్క మతానికి మాత్రమే సొంతంకాదని ఆయన నమ్మాడు. ఆయన హిందూమతం గురించి శ్రద్ధాసక్తులతో చదివాడు. భగవద్గీతనూ, ఉపనిషత్తులనూ పారశీక భాషలోకి అనువదించాడు.

1657 వ సంవత్సరం షాజహాన్ వ్యాధిగ్రస్తుడయినప్పుడు దారా పక్కనే ఉన్నాడు. తండ్రి సింహాసనానికి ఆయనే వారసుడు కాగలడని అందరూ అనుకున్నారు. కాని, షాజహాన్ చిన్న కొడుకు ఔరంగజేబు, తక్కిన ఇద్దరు అన్నలను ఎదురుతిరగమని ప్రేరేపించాడు. నిష్కపటీ, నిజాయితీపరుడూ అయిన దారాను, ఆయన నుంచి సహాయం పొందిన మిత్రులు సైతం వెన్నుపోటు పొడిచారు. ఆయన తన శత్రువులచేత అనేక యుద్ధాలలో ఓడిపోయాడు. పర్షియాకు పారిపోతూ మార్గమధ్యంలో జీవన్ మాలిక్ అనే మిత్రుడి ఇంట ఆశ్రయం కోరాడు. కాని, వాడు కృతఘ్నుడై దారాను ఔరంగజేబుకు పట్టిఇచ్చాడు. ఔరంగజేబు అతణ్ణి మౌలానాలకు అప్పగించాడు. దారా మత విరుద్ధంగా నడుచుకున్నాడన్న నేరం ఆరోపించి, వాళ్ళు ఆయనకు మరణదండన విధించారు. 1659 వ సంవత్సరం ఆగస్టు 30 వ తేదీన దారా మరణ శిక్ష అమలు జరిగింది.



## ఎవరాయన?

ప్రతిష్ఠానపురవాసి అయిన ఒక పండితుడు, అనేక సంవత్సరాలు దేశమంతటా పర్యటించి, అమితోత్సాహంతో వందలాది కథలను సేకరించి, రాజధానీ నగరానికి తిరిగి వచ్చాడు. తాను సేకరించిన కథలను రాజుకు వినిపించాలని రాజసభకు వెళ్ళాడు. కాని, రాజు వాటిని వినడానికి ఆసక్తి కనబరచలేదు. పండితుడు మౌనంగా రాజసభను వదలి, ఒక నిర్జన ప్రదేశం చేరుకుని, మంట రగిల్చి తాను సేకరించిన తాళ పత్రాలను అందులోకి వేయసాగాడు!

ఈ సంగతి తెలియగానే రాజు పరుగు పరుగున అక్కడికి వచ్చాడు. కాని, అలోగానే, పండితుడు సేకరించిన ఏడు సంపుటాలలో ఆరు అగ్నికి ఆహుతయి పోయాయి! ఏడవ సంపుటి మాత్రం రక్షింపబడి, ఆ తరవాత అది సంస్కృత భాషలోకి అనువదించబడింది.

ప్రప్రథమంగా కథలను సేకరించిన ఆ పండితుడు ఎవరో తెలుసా?

(VIII పేజీ చూడండి)

# విజ్ఞాన వినోదం



**సూచనలు :**

ఉడుకుతున్న పిండిని కాస్త తీసి, దాని మీద కొన్ని అయొడిన్ చుక్కలు వేయండి. అది వెంటనే నీలం రంగుగానో, ఊదా–నలుపురంగుగానో మారుతుంది. ఈ అయొడిన్ పరీక్ష పిండిపదార్థాలను (స్టార్చ్) తెలుసుకునే చక్కటి మార్గం. బంగాళాదుంప ముక్కల మీద, రొట్టెముక్కలవంటి ఆహారపదార్థాల మీద అయొడిన్ చుక్కలు వేసి పరిశీలించండి. ఆహారపదార్థం, పచ్చి బంగాళాదుంపలాగా చాలా తాజాగా ఉన్నప్పుడు పిండి అరగడానికి కొంతసేపు పడుతుంది. నోట్ బుక్ కాగితం మీద, న్యూస్ పేపర్ ముక్క మీద, డిట్టో పేపర్ మీద, నున్న (గ్లాసీ)గా వున్న మేగజైన్ పేపర్ మీద అయొడిన్ చల్లి నీలంగా మారుతుందేమో గమనించండి.

## 'స్టార్చ్ టెస్ట్'




**ఏం జరుగుతుంది? ఎలా జరుగుతుంది?**

బంగాళాదుంప, పిండి, పిండితో చేసిన రొట్టెవంటి ఆహారపదార్థాలూ వాటితోపాటు నోట్ బుక్ కాగితం, డిట్టోపేపర్ వీటిలో పిండి పదార్థం ఉన్నట్టు తెలుస్తుంది. అయితే న్యూస్‌పేపర్ లోనూ, గ్లాసీగా వున్న మేగజైన్ పేపర్లో స్టార్చ్‌లేదు. కాగితాన్ని మృదువుగా చేసే 'ఫిల్లర్' న్యూస్ పేపర్‌లో లేదు. ఇక ఖరీదయిన గ్లాసీ పేపర్లలో తెల్లటి 'క్లేఫిల్లర్' ఉపయోగిస్తారు. నోటుపుస్తకం, డిట్టో పేపర్‌లలో, స్టార్చ్‌ఫిల్లర్ వున్నది!

కొన్నిరకాల అహారాలను వాసనచూసి కనుగొనవచ్చు. మరి, పిండిపదార్థాలను కూడా అలాగే కనుగొనవచ్చా? ప్రయత్నించి చూడండి.

పిండిపదార్థం జీర్ణం కావడానికి ముందు, చక్కెరగా మార్పు చెందుతుంది. నోటిలోని లాలాజలం ఒక రకమైన జీర్ణరసం. ఆ కారణంగా, పళ్ళ మధ్య ఇరుక్కుపోయే పిండిపదార్థం, క్రమేణా చక్కెరగా మార్పు చెందుతుంది. రొట్టెముక్క, నోట్లో వేసుకుంటే కొంతసేపయ్యాక నోరు తియ్యగా వుండడం గమనించారా?

పళ్ళమధ్య తయారయ్యే చక్కెర పళ్ళకు హాని కలిగిస్తుంది. అందువల్ల పళ్ళ శుభ్రతలో జాగ్రత్త వహించాలి!

# డయానా దేవాలయం

ఆసియా మైనర్ పశ్చిమ సముద్రతీరంలో ఒకప్పుడు సుసంపన్నమైన ఎఫిసస్ నగరం ఉండేది. నగర మధ్యంలో వెలసిన డయానా దేవాలయం కారణంగా ఆ నగరం మరింత ప్రసిద్ధిగాంచింది. (గ్రీకులు ఆ దేవతను అర్తిమెస్ అని పిలిచేవారు.) ఎఫిసస్ ప్రజలు దాదాపు 220 సంవత్సరాలు శ్రమించి, ఈ దేవాలయాన్ని నిర్మించినట్టు చెబుతారు. దురదృష్టవశాత్తు రోమను చక్రవర్తి నీరో ఈ దేవాలయాన్ని ముట్టడించాడు; క్రీ. శ. 262 వ సంవత్సరంలో గోథలు దీనిని సర్వనాశనం చేశారు!



గొప్ప చారిత్రక ఘట్టాలు:

# అలెగ్జాండర్-పుర



మెసడోనియా రాజు ఫిలిప్ కుమారుడయిన అలెగ్జాండర్, తననొక దేవకుమారుడుగానే భావించేవాడు. ఎవరూ అంతవరకు సాధించలేని ఘనవిజయాలు తాను సాధించమన్నట్లు, అతరు బాల్యంనుంచే కలలు కనేవాడు।

అలెగ్జాండర్ జన్మించిననాడే, అతని తండ్రి యుద్ధంలో అపూర్వ విజయం సాధించాడు. ఆ కారణంగానే, అతని తండ్రి కూడా తన కుమారుణ్ణి దివ్యాంశ సంభూతుడుగా భావించాడు.

మానవ చరిత్రలోనే గొప్ప తత్వవేత్తగా ప్రసిద్ధిగాంచిన అరిస్టాటిల్ వద్ద అలెగ్జాండర్ విద్య నభ్యసించాడు. "తండ్రి నాకు జన్మనిచ్చాడు; జీవితాన్ని ఎలా మలుచుకోవాలో అరిస్టాటిల్ నేర్పాడు।" అనేవాడు అలెగ్జాండర్।

అరిస్టాటిల్, అలెగ్జాండర్‌ను ప్రపంచాధినేత కమ్మని ప్రబోధించినట్టు చెప్పలేము. అయితే, అతనిలోని అన్వేషణ దాహాన్ని మాత్రం అరిస్టాటిల్ ప్రేరేపించాడనడంలో సందేహంలేదు. ఆ అన్వేషణ దాహం కారణంగానే అలెగ్జాండర్ అనేక విజయాలను సాధించగలిగాడు।

క్రీ. పూ. నాలుగవ శతాబ్దంలో పర్షియాను డరియస్ అనే గొప్ప రాజు పరిపాలించేవాడు. అలెగ్జాండర్ అతన్ని అవలీలగా ఓడించాడు. ఆ విజయోత్సాహంతో ప్రపంచ దేశాలను తన పాదాక్రాంతం చేసుకోవాలన్న పట్టుదలతో అలెగ్జాండర్, సేనను సమకూర్చుకుని దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. ఒక్కొక్క దేశాన్ని వశపరచుకుంటూ క్రీ. పూ. 326వ సంవత్సరం సస్యశ్యామలమైన భారతదేశంలో అడుగుపెట్టాడు. అంతటి మహోన్నతమైన నాగరికతను అతనెన్నడూ చూసి ఎరుగడు. తక్షశిల రాజ్యంమీదికి దండెత్త

## ుషోత్తముల యుద్ధం



దానికి ఆయత్తమయ్యారు. కాని, అంతలోనే తక్షశిల రాజు ఆయనకు జోహార్లు పలికాడు. అతడు,ఏర్పాటు చేసిన స్వాగత ఉత్సవంలో పలువురు రాజులు పాల్గొన్నారు. కాని, జీలంనదికి అవలిగట్టున పరిపాలన సాగిస్తున్న పురువంశపు పురుషోత్తముడు మాత్రం ఆ ఉత్సవానికి హాజరు కాలేదు. అతడు అలెగ్జాండర్‌ను యుద్ధంలో ఎదుర్కోగలనని సవాలు చేశాడు।

తుపాను వీస్తున్న ఒకనాటి అర్ధరాత్రి సమయంలో, అలెగ్జాండర్ సేనలు, జీలంనది దాటి, హఠాత్తుగా పురుషోత్తముడి సేనలపై బడ్డాయి. దురాక్రమణను తిప్పి కొట్టడానికి పురుషోత్తముడు సేనలను సమీకరించుకుని వీరావేశంతో పోరాడాడు. అసంఖ్యాకులైన సైనికులు హతులయ్యారు. వారి ధైర్యసాహసాలకు అలెగ్జాండర్ అమితాశ్చర్యం చెందాడు. ఆఖరికి, రక్తం ఓడుతూన్న శరీరంతో, పురుషోత్తముణ్ణి, అలెగ్జాండర్ సమక్షానికి తీసుకువచ్చారు. అప్పుడు అలెగ్జాండర్ అతణ్ణి "నేను నిన్నెలా చూడాలని ఆశిస్తున్నావు?" అని అడిగాడు.

"సాటి రాజుగా గౌరవించు. అంతే చాలు।" అన్నాడు పురుషోత్తముడు।

"ఇంకా ఏదైనా కావాలంటే కోరుకో," అన్నాడు అలెగ్జాండర్.

"నా మొదటి కోరికలోనే అంతా ఉన్నది।" అన్నాడు పురుషోత్తముడు ధైర్యంగా.

అతని ధైర్యసాహసాలకు ముగ్ధుడైన అలెగ్జాండర్, అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి, అతని రాజ్యాన్ని అతనికే అప్పగించాడు. ఇరువురూ స్నేహితులయ్యారు।

## గత చరిత్రలోకి చూద్దాం



1. జంకుగొంకులేని తన మాటలతో అలెగ్జాండర్ చక్రవర్తికి దిగ్భ్రాంతి కలిగించిన భారతీయ యువకుడెవరు?
2. ఆ యువకుడు స్థాపించిన వంశం ఏది?
3. అతని గురువూ – మంత్రీ ఎవరు?
4. ఆయన రచించిన గొప్ప గ్రంథం ఏది?
5. దాని ప్రత్యేకత ఏమిటి?
6. కనిష్కుడి ఆదరణ పొందిన సుప్రసిద్ధ వైద్యుడు ఎవరు?
7. అతడు రచించిన గ్రంథం ఏది?
8. కలకత్తా నగరాన్ని నిర్మించినవారెవ్వరు?
9. ఆ నగర నిర్మాణం ఎప్పుడు ప్రారంభమయింది?
10. కలకత్తాలో వెలసే అతి ప్రాచీనమైన స్థలం ఏది?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. అప్పుడే పుట్టిన 'కంగారూ' పరిమాణం ఎంత వుంటుంది?
2. నాలుగేళ్ళ ప్రాయంలోనే 'ఆపెరా' సంగీత నాటకం రూపొందించి ఖ్యాతి గాంచిన వారెవ్వరు?
3. చీమ ఎంతబరువు మోయగలదు?
4. 'ఉరాంగ్ ఉటాన్' అనే మాటకు అర్థం ఏమిటి?
5. ప్రపంచంలోకెల్లా చాలా పొడి ప్రదేశం ఏది?
6. సూర్యుడంత పరిమాణంలో ఎన్ని భూగోళాలు ఇమడగలవు?
7. భూమిమీదపడిన అతి బరువైన ఉల్కాలోహం ఎక్కడ వున్నది?
8. మనిషి రెండు మూత్రపిండాలలో వున్న నాళాల పొడవెంతో తెలుసా?
9. వర్షంలో విటమినులు ఉన్నాయా?
10. ఏసుక్రీస్తు పుట్టుకనుంచే డిసెంబర్ 25 వ తేదీ, క్రిస్మస్'గా కొనియాడబడుతున్నదా?

(VIII పేజీ చూడండి)



# సాహిత్యావలోకనం

1. మన దేశంలో సృజనాత్మక రచనకు అందజేసే జాతీయ బహుమతి ఏది?
2. ఆ బహుమతి నిచ్చే సంస్థ పేరేమిటి?
3. దానికి సంబంధించిన మరి రెండు సంస్థలేవి?
4. ప్రముఖ రచయితగా పేరుగాంచిన భారత ప్రధాని ఎవరు?
5. ఆయన రచనలలో ప్రసిద్ధిగాంచిన మూడు రచనలు ఏవి?
6. రవీంద్రనాథటాగూర్‌కు నోబెల్ బహుమతి ఎప్పుడు వచ్చింది?
7. ఆ బహుమతి రావడానికి కారణమైన గ్రంథం ఏది?
8. ఆంగ్లంలో అందమైన కవితలు వెలయించిన పోర్చుగీసు—భారతీయ యువకవి ఎవరు?
9. లోకమాన్య బాలగంగాధరతిలక్ రచించిన సుప్రసిద్ధ గ్రంథం ఏది?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: గుండె

| | | |
|---|---|---|
| అస్సామీ : హృదయ్ | బెంగాలీ : హృదయ్ | గుజరాతీ : హియాన్, హృదయ్ |
| హిందీ : హృదయ్, దిల్ | కన్నడం : హృదయ | కాశ్మీరీ : దిల్ |
| మలయాళం : హృదయం | మరాఠీ : హృదయ్ | ఒరియా : హృదయ్ |
| పంజాబీ : హిరద, దిల్ | సంస్కృతం : హృదయ | సింధి : దిల్, హియాన్ |
| తమిళం : ఇదయం | ఉర్దూ : దిల్, జమీన్ | |

## మీరు నమ్ముతారా?

* తల్లిదండ్రుల ఆయుఃపరిమితి తక్కువగా ఉన్నప్పుడు, బిడ్డ కూడా తక్కువకాలమే జీవిస్తుందా?
* ఐస్‌క్రీములు చలువచేస్తాయా?
* కలలు రంగు రంగులుగా వుండవా?

కానే కాదు!

* ఆయుఃపరిమితికి సంబంధించినంతవరకు ఒకదానికొకటి సంబంధం లేదని పరిశోధనలు తెలియ జేస్తున్నాయి.
* ఐస్‌క్రీములలో కేలరీలు ఎక్కువగా వుండడంవల్ల అవి ఆఖరికి వేడినే పుట్టిస్తాయి.
* రంగు రంగుల కలలూ వస్తాయి!

# సమాధానాలు

## ఎవరాయన?

బృహత్కథను రచించిన గుణాఢ్యుడు. ఆ తరవాత బృహత్కథ సోమదేవుడిచే సంస్కృతంలోకి అనువదించబడి 'కథా సరిత్సాగరం'గా ప్రసిద్ధిగాంచింది.

## చరిత్ర

1. చంద్రగుప్తుడు.
2. మౌర్యవంశం.
3. కౌటిల్యుడు (చాణక్యుడు).
4. అర్థశాస్త్రం.
5. ప్రపంచంలో ప్రప్రథమంగా రచింపబడిన క్రమబద్ధమైన న్యాయ, సామాజిక శాస్త్ర గ్రంథం.
6. చరకుడు.
7. చరక సంహిత.
8. జాబ్ చర్నాక్.
9. 1690వ సంవత్సరం ఆగస్టు 24వ తేదీ.
10. కాళీఘట్‌లోని కాళీమందిరం.

## లోకజ్ఞానం

1. ముప్పావు అంగుళమే వుంటుంది. అయితే అది బాగా పెరిగేవరకు తల్లి కడుపు కింది సంచిలోనే వుంటుంది.
2. మొజార్ట్. 'మిత్రిడేట్స్' సంగీత నాటకం.
3. తన బరువుకు యాభై రెట్లు ఎక్కువ మోయగలదు!
4. 'అరణ్యవృద్ధుడు.'
5. చిలీలోని కలామ్ ప్రాంతం. మనిషి ఎరిగినంతవరకు అక్కడ ఒక్క చినుకు పడలేదు.
6. పదిలక్షల భూగోళాలకన్నా ఎక్కువ.
7. ఆఫ్రికాలో. అరవైటన్నుల బరువున్నది. హొబా వెస్ట్ ఉల్కాలోహం.
8. దాదాపు నలభైమైళ్ళు.
9. బి విటమిను ఉన్నది.
10. కాదు. క్రీ. శ. 440 నుంచి మాత్రమే.

## సాహిత్యం

1. సాహిత్య అకాడెమీ బహుమతి.
2. సాహిత్య అకాడెమీ.
3. సంగీత–నాటక అకాడెమీ; లలితకళా అకాడెమీ.
4. జవహర్‌లాల్ నెహ్రూ.
5. డిస్కవరీ ఆఫ్ ఇండియా (భారత దర్శనం); గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ (ప్రపంచ చరిత్ర); స్వీయచరిత్ర.
6. 1913వ సంవత్సరంలో.
7. గీతాంజలి.
8. హెన్రీ డిరోజియో
9. గీతారహస్యం.